KHUTBAT-I
HAQEEQAT-E-IMAN
(Telugu)

# ఈమాన్ వాస్తవికత

మూలం:
మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మలై)

అనువాదం:
ఎస్.ఎమ్. మలిక్

# తొలిపలుకు

ఇది, మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదిగారు హిజ్రీ శకం 1357 (క్రీ.శ. 1937)లో దారుల్ ఇస్లామ్ పఠాన్‌కోట్ జామె మస్జిద్ నందు ఉర్దూలో చేసిన జుమా ప్రసంగాల సంపుటి. ఈ ప్రసంగాలు, పుస్తక రూపంలో వెలువడిన పిదప సామాన్య ప్రజలకు "దీన్ శిక్షణ" గరపేందుకు అమిత లాభదాయకంగా రూపొందినవి. ఈ సంపుటి యొక్క ప్రచురణలు అనేకం వెలువడి ప్రజాదరణ పొందాయి.

ఈ సంపుటిని తొలుత ఉర్దూలో ప్రచురించినప్పుడు మౌలానా గారు స్వయంగా వ్రాసిన పీఠికలోని రెండు ముఖ్యాంశాలు గమనార్హమయినవి.

ఆయన ఇలా వ్రాశారుః

(1) ఇంతకు ముందు రిసాలయె దీనియాత్ (ఇదియే ఇస్లామ్)లో ఇస్లామ్ విశ్వాసాలను బాగా విపులంగా వివరించి ఉన్నాను. ఇస్లామ్ శాసనాంగాన్ని (షరీఅత్‌ను) కూడా సంక్షిప్తంగా సూచించివున్నాను. ఈ సంపుటిలో మరో రెండు విషయాలు తగినంత వివరంగానూ, విశదంగానూ చేర్చబడ్డాయి. మొదటిది "దీన్ సారంశం." రెండవదిః "ఆరాధన," "ఇదియే ఇస్లామ్"కి తోడుగా ఈ ప్రసంగాలను చేర్చి చదివే వారికి దీన్ మార్గం తేటతెల్లంగా ప్రజ్వలితమవుతుందని ఆశిస్తున్నాను. మార్గ జ్ఞానాన్ని అనుగ్రహించడం దైవేచ్ఛ.

(2) ఈ ప్రసంగాలు జుమాలో వినిపింపగోరే మిత్రులు, ప్రతి ప్రసంగానికి ముందు ఖుత్బయే మస్నూన పఠించాలి; ఖుత్బయే సానియా తమకు నచ్చినది వారు పఠించగలరు; కాని, అది కూడా తప్పనిసరిగా అరబీలోనే ఉండవలెసివుంటుంది.

– అబ్దుల్ అజీజ్
అమీరె హల్ఖా, ఆంధ్ర ప్రదేశ్
జమాఅతె ఇస్లామీ హింద్

1968

# విషయసూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# 'ముస్లిమ్' అవడానికి జ్ఞానమవశ్యం

ముస్లిమ్ సోదరులారా! ప్రపంచంలో అన్నిటికన్నా గొప్పదైన దైవకానుక "ఇస్లామే" అని మనస్ఫూర్తిగా విశ్వసిస్తాడు ప్రతి ముస్లిమ్. హజ్రత్ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) స్థాపించిన ఉమ్మత్ (అనుచర సంఘం)లో తన్ను చేర్చి ఇస్లామ్‌ను అనుగ్రహించినందుకు దేవునికి తన కృతజ్ఞతాభివందనాలు చెల్లించుకుంటూ ఉంటాడు కూడాను. ఇదే తాను అనుగ్రహించిన కానుక అని అల్లాహ్ స్వయంగానూ సూచించివున్నాడు. దివ్య ఖుర్‌ఆన్‌లో ఈ విధంగా ఆదేశించబడింది.

> "నేడు మీ కొరకు మీ 'దీన్'ని (జీవన సన్మార్గాన్ని) పరిపూర్ణం గావించాను మరియు మీపై నా అనుగ్రహాన్ని పూర్తిచేశాను. 'ఇస్లామ్'నే మీ జీవన మార్గంగా సమ్మతించాను." (5 : 3)

దైవం మీకు చేసిన ఈ ఉపకారానికిగాను కృతజ్ఞతలు తెలుపడం మీ విధి. ఎందుకంటే చేసిన ఉపకారానికి కృతజ్ఞతను తెలుపని వ్యక్తి కృతఘ్నుడవుతాడు. మనిషి తన ప్రభువు చేసిన ఉపకారానికి కృతజ్ఞత తెలుపకపోవడం నీచాతినీచమయిన కృతఘ్నత. అయితే దేవుని ఉపకారానికి కృతజ్ఞత ఏ

విధంగా చెల్లించాలి అని మీరడగవచ్చు. ఇదే సమాధానం : "దైవం మిమ్మల్ని హజ్రత్ ముహమ్మద్(సల్లల్లాహు అలైహి వ సల్లం) ఉమ్మత్‌లో చేర్చినందుకు ముహమ్మద్ (సఅసం)ను సంపూర్ణంగా అనుసరించడమే ఈ ఉపకారానికి సరయిన కృతజ్ఞత. దైవం మిమ్మల్ని ముస్లిమ్ సమాజంలో చేర్చాడు. ఆయన చూపిన ఈ అనుగ్రహానికి కృతజ్ఞత తెలుపడం పరిపూర్ణ ముస్లిమ్ అవడం ద్వారానే సాధ్యం. మరే విధంగానూ దేవుని ఈ మహా ప్రసాదానుగ్రహానికి కృతజ్ఞత చెల్లించుకోలేరు. అయితే ఈ కృతజ్ఞతను చెల్లించకపోయారా - దేవుని అనుగ్రహం ఎంత గొప్పదో, కృతఘ్నత వల్ల ఆయనకు కలిగే ఆగ్రహం కూడా అంతే అధికంగా ఉంటుంది. ఈ ఆగ్రహాన్నుంచి దైవం మనల్ని రక్షించుగాక!

ఇకపోతే, ఒక వ్యక్తి "పరిపూర్ణ ముస్లిమ్" ఏ విధంగా కాగలడని మీరు మరో ప్రశ్న అడగవచ్చు. దీని సమాధానం విశదంగా చెప్పవలసి ఉంటుంది. వచ్చే జుమా ఖుత్బాలలో (శుక్రవారం ప్రసంగాలలో) దీనికి సంబంధించిన ఒక్కొక్క అంశాన్నే మీ ముందు విపులీకరిస్తాను. కాని నేటి ప్రసంగంలో ముస్లిమ్ అవడానికి అన్నిటికన్నా ప్రధానమైన ఆవశ్యకత ఏదైతే ఉందో దాన్ని వివరిస్తాను. దీన్ని ఈ విషయంలో తొలిమెట్టుగా భావించవచ్చు. మీరు ఉపయోగించే "ముస్లిమ్" అనే పదానికి భావమేమిటో కాస్త మీ బుద్ధి బలాన్ని ఉపయోగించి ఆలోచించండి.

మానవుడు తన మాతృగర్భాన్నుంచే "ఇస్లామ్" అనే దాన్ని తెచ్చుకుంటాడా? మనిషికి ఒక ముస్లిమ్ కొడుకో లేక మనుమడో అవడం మూలాన ముస్లిమ్ అవుతాడా? ఒక బ్రాహ్మణ సుతుడు బ్రాహ్మణుడుగా, రాజ పుత్రుని పుత్రుడు రాజపుత్రుడుగా, శూద్రుని పిల్లవాడు శూద్రుడుగా జన్మించినట్లే ముస్లిమ్ కూడా "ముస్లిమ్" అయి జన్మిస్తాడా? ఒక ప్రత్యేక జాతివారో లేక

వంశంవారో ముస్లిములవుతారా? ఒక ఆంగ్లేయుడు, ఆంగ్ల జాతిలో పుట్టిన కారణాన ఆంగ్లేయుడయినట్లు, ద్రవిడ జాతిలో జన్మించినంత మాత్రాన ద్రవిడులు అయినట్లే, ఒక వ్యక్తి ముస్లిములనబడే జాతిలో జన్మించిన కారణానే ముస్లిమ్ అవుతాడా? ఇవే నేను మిమ్మల్ని అడిగే ప్రశ్నలు. వీటికి మీ సమాధానాలేమిటి? కాదు, అలాంటి వ్యక్తిని ముస్లిమనరు. మనిషి వంశ పారంపర్యం కారణంగా ముస్లిమవజాలడు; "ఇస్లామ్"ను స్వీకరిస్తేనే ముస్లిమవు తాడు. అతడు "ఇస్లామ్"ను విడిచిపెడితే ముస్లిమ్‌గా ఉండజాలడు. ఒక వ్యక్తి బ్రాహ్మణుడయినా, రాజపుత్రుడయినా, ఆంగ్లేయుడయినా, ద్రవిడుడైనా, పంజాబీ అయినా లేక మరే జాతికి చెందిన వాడయినా అతడు "ఇస్లామ్"ను స్వీకరిస్తే ముస్లిములలో చేరిపోతాడు. మరొక వ్యక్తి ముస్లిముల ఇంట పుట్టి నప్పటికీ ఇస్లామ్ అనుసరణను విడిచి పెడితే అతను ముస్లిమ్ సమాజానికి దూరమవుతాడు - అతను సయ్యిద్ కుమారుడయినా లేక పఠాన్ పుత్రుడయినా అంతే ! మీరింతే బదులిస్తారు కదా!

మహాశయులారా! ఈ మీ సమాధానాల ద్వారా వ్యక్తమయ్యే విషయాన్ని గమనించండి : మీకు ప్రాప్తమయిన ఈ మహత్తర దైవ కానుక మీరు లక్ష్యపెట్టినా, పెట్టకపోయినా మీకు జీవితాంతం అంటిపెట్టుకుని ఉండటానికి తల్లిదండ్రుల ద్వారా దానంతట అదే లభించేది కాదు. దీన్ని పొందడం పూర్తిగా మీ స్వయంకృషిపైనే ఆధారపడి ఉంది. మీరు ప్రయత్నించి పొంద గోరితే అది మీకు లభిస్తుంది. కాని ఆచరించకపోయారా మీరు దాన్ని కోల్పోతారు (దైవం రక్షించుగాక!).

ఇంకా, ఇస్లామ్‌ను స్వీకరిస్తే మనిషి ముస్లిమవుతాడని మీరు అన్నారు. ఇస్లామ్‌ను స్వీకరించడమంటే ఏమిటి? ఇస్లామ్‌ను స్వీకరించడమంటే, కేవలం నోటితో "నేను ముస్లిమ్"ని అనో లేక "ముస్లిమ్ అయ్యాను" అనో అన్న

ప్రతి వ్యక్తీ దేవుని దృష్టిలో ముస్లిమవుతాడని భావమా లేక ఒక వ్యక్తి కొన్ని అరబీ వాక్యాలను వాటి భావాన్ని ఎరుగకుండా నోటితో వల్లించినంత మాత్రాన్నే ముస్లిమవుతాడని అర్థమా? చెప్పండి. ఈ ప్రశ్నకు మీ సమాధాన మేమిటి? "హజ్రత్ ముహమ్మద్ (సఅసం) బోధించిన బోధలను తెలుసు కోవాలి; వాటిని అర్థం చేసుకోవాలి; మనస్పూర్తిగా వాటిని స్వీకరించాలి; వాటి ప్రకారం ఆచరించడానికి ప్రయత్నించాలి; ఇలా చేసిన వ్యక్తియే ముస్లిమ్, చేయని వాడు కాడు." ఇదేగా మీరిచ్చే సమాధానం?

ప్రథమంగా జ్ఞానం తరువాత ఆచరణ పేరే ఇస్లామని మీరిచ్చిన ఈ సమాధానం ద్వారానే తేటతెల్లమవుతుంది. ఒక వ్యక్తి జ్ఞానం లేకున్నా బ్రాహ్మణుడు కాగలడు. ఎందుకంటే అతను బ్రాహ్మణుడుగా జన్మించాడు, బ్రాహ్మణునిగానే ఉంటాడు. మరొక వ్యక్తి జ్ఞానం లేకున్నా 'జాట్' కాగలడు. ఎందువల్లనంటే అతడు జాట్‌గానే పుట్టాడు; జాట్‌గానే ఉంటాడు. కాని ఒక వ్యక్తి 'జ్ఞానం' లేకనే ముస్లిమవజాలడు. ఎందుకంటే ముస్లిమ్ పుట్టుకతోనే 'ముస్లిమ్' కాలేడు, జ్ఞానం ద్వారానే కాగలడు. హజ్రత్ ముహమ్మద్ (సఅసం) బోధించిన బోధన లేమిటో 'జ్ఞానం' లేనంతవరకు వాటిని ఎలా విశ్వసిస్తాడు? వాటి ప్రకారం ఎలా ఆచరిస్తాడు? కాబట్టి తేలిందేమంటే అజ్ఞానంతో ముస్లిమవడమూ మరియు ముస్లిమ్‌గా ఉండటమూ అసాధ్యం! ముస్లిమ్‌ల ఇంట పుట్టి ముస్లిమ్‌ల పేరుతో, ముస్లిమ్‌ల దుస్తులు ధరించి తన్నుతాము ముస్లిమని చెప్పుకునే ప్రతి వ్యక్తి వాస్తవానికి ముస్లిమ్ కాలేడు. ఇస్లామ్' అనేదాన్ని గ్రహించి జ్ఞానచైతన్యంతో విశ్వసిస్తూ దాన్ని ఆచరించే వ్యక్తే వాస్తవంగా ముస్లిమ్. ఒక వ్యక్తి పేరు లియోపోల్డు, రంజీత్ సింగ్, రాంప్రసాద్ అయినంత మాత్రాన తిరస్కారి అనీ, మరొక అతని పేరు అబ్దుల్లాహ్ అయి నందుకు ఇతను ముస్లిమని అనడానికి తిరస్కారి – ముస్లిమ్‌లలో నిజమయివ

వ్యత్యాసం పేరులో లేదు. ఇతను ప్యాంటు ధరిస్తాడు లేక ధోవతి కట్టుకుంటాడు. అందుకు తిరస్కారిన్నూ, ఇతను పై జమా ధరించడం వల్ల ముస్లిమున్నూ అన డానికి, తిరస్కారి–ముస్లిమ్‌లలో తేడా వస్త్రధారణ కూడా కాదు, వాస్తవానికి ఆ ఉభయుల మధ్య నిజమయిన భేద కారణంః 'జ్ఞానం' ఒక్కటే. అతను తిరస్కారి అవడానికి గల కారణం ః సర్వేశ్వరునికీ తనకు ఎలాంటి సంబంధం ఉందో, సృష్టికర్త ఇచ్ఛానుసారంగా ప్రపంచంలో జీవితం గడిపే సరళమయిన మార్గమేదో అతనికి తెలియకపోవడమే. ఇక, ఒక ముస్లిమ్‌నకు పుట్టిన వాని పరిస్థితి కూడా ఇలాగే ఉంటే, మీరే చెప్పండి. ఇతన్ని మరొక తిరస్కారినీ మరే విషయం ఆధారంగా వేరుగా పరిగణించగలరు? అతన్ని తిరస్కారని, ఇతన్ని ముస్లిమని ఎందుకంటారు?

మహాశయులారా! నేను చెప్పే ఈ విషయాన్ని కాస్త శ్రద్ధతో వినండి. మరి సావధానంగా దీన్ని గురించి ఆలోచించండి. మీరు తమ ధన్యవాదాలు చెల్లించుకునే, కృతజ్ఞతాతత్పరతను చాటుకునే దేవుని ఈ అత్యంత భాగ్యానుగ్రహం లభించడమున్నూ, లభ్యమై స్థిరంగా ఉండటమున్నూ ఈ రెండు విషయాలూ 'జ్ఞానం' మీద ఆధారపడి ఉన్నాయి. జ్ఞానమే లేకపోతే ఈ భాగ్యానుగ్రహం మానవునికి ప్రాప్తమే కాజాలదు. ఏ కొద్దిగా ప్రాప్తమయినా అజ్ఞానం మూలాన అత్యంత దివ్యమైన ఈ ప్రసాదానుగ్రహం అతని చేజారి పోతుందన్న ప్రమాదం ప్రతి క్షణమూ ఉంటుంది. కేవలం అవివేకం మూలాన తాను ఇంకనూ ముస్లిమ్‌గానే ఉన్నట్లే తలచుకుంటూ ఉంటాడు. కాని, వాస్తవానికి అతను ముస్లిమై ఉండడు. ఇస్లామ్ మరియు కుఫ్ర్ – ఈ రెంటి మధ్య తేడా ఏమిటో తౌహీద్ (దేవుని ఏకత్వపు భావన)లోనూ, షిర్క్ (బహుదైవభావన)లోనూ భేదమేమిటో అసలే తెలియని వ్యక్తి ఎలాంటివాడో తెలుసా? అతని సంగతి గాఢాంధకారంలో కాలిబాటపై నడిచే వానిని పోలి

ఉంటుంది. సరయిన మార్గాన నడుస్తూ నడుస్తూ అతని కాళ్ళు తామై వేరొక మార్గానికి మరలిపోగలవు. కాని తాను సరళ మార్గం నుంచి తొలగిపోయినట్లు అతనికి స్పృహ కూడా ఉండదు. ఇంకా మరో విధంగా కూడా జరగవచ్చు: మార్గమధ్యంలో దజ్జాల్ (మార్గభ్రష్టకుడు) లాంటివాడు తటస్థించి, "ఇదిగో అబ్బాయి, నీవు చీకటిలో దారితప్పావు, ఇలారా, నిన్ను గమ్యస్థానానికి చేర్చుతాను" అని సహాయాన్ని అందిస్తాడు. పాపం! చీకటి బాటసారి తాను స్వయంగా కళ్ళారా సరయిన మార్గమేదో చూడజాలని కారణాన అవివేకంతో తన చేయి ఆ దజ్జాల్ హస్తగతం చేస్తాడు. వాడు ఇతన్ని సరళ మార్గం తప్పించి మరి వేరే ఎటు వైపుకైనా తీసుకుని వెళ్ళగలడు. ఇతని వద్ద స్వతహాగా ఏ వెలుగు లేకపోయి, తాను స్వయంగా తన మార్గ చిహ్నాల్ని చూచుకోజాలని కారణానే కదా ఇతనికి ఈ దురవస్థా ప్రమాదాలున్నా? ఇతని వద్దే వెలుగు ఉండి ఉంటే తాను మార్గం తప్పి ఉండేవాడు కాడు, లేక మరొకడూ ఇతన్ని మర్గాన్నుంచి తప్పించి ఉండే వాడూ కాదు. ఇదే విధంగా ఊహించుకోండి. ఇస్లామ్ బోధనల గురించి ముస్లిమ్‌లకే తెలియకపోవడం, పవిత్ర ఖుర్‌ఆన్ బోధించేదేమిటో, హజ్రత్ ముహమ్మద్ (సఅసం) చూపిపోయిన మార్గదర్శకమేమిటో అతను ఎరుగకపోవడం - ఇంతకంటే గొప్ప ప్రమాదం ముస్లిమ్‌లకు రాగలదేముంది. ఈ అజ్ఞానం వల్ల ఇతను తానై కూడా దారి తప్పవచ్చు. దజ్జాల్ లాంటివారు ఇతరులు కూడా ఇతన్ని మార్గ భ్రష్టునిగా చేయవచ్చు. కాని ఇతని వద్దే జ్ఞానకాంతి ఉంటే జీవితంలో అడుగడుక్కూ ఇస్లామ్ చూపే సరళ మార్గాన్ని చూడగలడు. ప్రతి అడుక్కూ అడ్డువచ్చే కుఫ్ర్ (తిరస్కృతి), షిర్క్ (బహు దైవభావన), మార్గవిహీనత, దుష్టత్వమూ, దుష్క్రియల వక్ర మార్గాలను గుర్తుపట్టి వాటి నుండి తన్ను రక్షించుకోగలడు. మరి, మార్గమధ్యంలో భ్రష్టకారుడెవడైనా తటస్థిస్తే,

అతని రెండు మూడు పలుకుల్లోనే అతను భ్రష్టకారుడని, అతన్ని అనుస రించకూడదని తానే స్వయంగా అర్థం చేసుకోగలడు.

సహోదరులారా! ఏ జ్ఞానం యొక్క ఆవశ్యకతను మీ ముందు మరీ మరీ వివరిస్తున్నానో దీని మీద మీరు, మీ సంతతి ముస్లిమవడమూ, ముస్లిముగా ఉండటమూ ఆధారపడి వున్నాయి. దీన్ని ఉపేక్షించడానికి ఇది ఏదో సాధారణ విషయం కాదు. మీ వ్యవసాయ పనులను గూర్చి మీరు అశ్రద్ధ చేయరు. మీ పైర్లూ పొలాలకు నీటి పంపిణీలో, మీ పంటల రక్షణలోనూ అజాగ్రత్త వహించరు. మీ వృత్తి పనుల పట్ల అలక్ష్యంగా ఉండరు. కారణం? అశ్రద్ధ చేశారంటే తిండిలేక ఛస్తారు. ప్రాణం లాంటిదాన్నీ కోల్పోతారు. ఇక చెప్పండి, మీరు ముస్లిమవడమూ, ముస్లిమ్‌గా ఉండటమూ ఆధారపడి ఉన్న "జ్ఞానాన్ని" పొందడంలో అజాగ్రత్త వహిస్తారెందుకూ? ఇలా ఉంటే మీ ఈమాన్ (విశ్వాసం) లాంటి ప్రియప్రదమయినది కోల్పోయే ప్రమాదం లేదా? విశ్వాసం ప్రాణాలకన్నా ప్రియమయినది కాదా? మీ ప్రాణాలను రక్షించే సామగ్రి కొరకు ఎంత కాలమూ, ఎంత కృషి వ్యయపరుస్తున్నారో, ఆ కాలమూ ఆ కృషిలో పదోవంతయినా విశ్వాసాన్ని రక్షించే విషయాలకై వినియోగించజాలరా?

మీలో ప్రతి వ్యక్తీ మౌల్వీ అవ్వాలనీ, పెద్ద గ్రంథాలు చదవాలనీ, తమ జీవితపు పది పన్నెండేళ్ళు విద్యాభ్యాసంలో గడపాలనీ మీతో నేననడం లేదు. ముస్లిమవడానికి ఇంతగా చదవడం అవసరం లేదు. నేను కోరేది, మీలోని ప్రతి వ్యక్తి రేయింబవళ్ళ ఇరవై నాలుగు గంటల్లో కేవలం ఒక గంటయినా దీన్ (సన్మార్గ) విద్యను అభ్యసించడానికి వినియోగించాలని మాత్రమే. పవిత్ర ఖుర్‌ఆన్ ఏ అంశానికై ఎలాంటి బోధనలను తెచ్చిందో, దాని సారాంశాన్ని గ్రహించాలి. మహాప్రవక్త (సఅసం) ఏ విషయాన్ని నిర్మూ

లించడానికి, దాని స్థానాన దేన్ని స్థాపించడానికి విచ్చేశారో దాన్ని సవ్యంగా తెలుసుకోవాలి. దైవం ముస్లిమ్‌ల కొరకు నియమించిన ప్రత్యేక జీవిత విధానాన్ని బాగా అవగాహన చేసుకునేటంతటి కనీసపు జ్ఞానమైనా ముస్లిమ్‌ల ప్రతి బాలునికి, యువకునికీ, వృద్ధునికీ ప్రాప్తమయి ఉండాలి. ఇంతటి జ్ఞానం పొందడానికి ఎంతో ఎక్కువ సమయం అవసరం లేదు. ఈమాన్(విశ్వాసం) ప్రియమయినదయితే రోజుకు ఒక గంట కేటాయించడం ఎంతో కష్టంకాదు.

# ముస్లిమ్-తిరస్కారుల నిజభేదం

ముస్లిమ్ సహోదరులారా! ముస్లిమ్ అంతస్తు తిరస్కారి అంతస్తుకన్నా ఉన్నత మైందనీ, దేవుడు ముస్లిమంటే ఇష్టపడతాడనీ, తిరస్కారంటే ఇష్టపడడనీ దైవ సన్నిధిలో ముస్లిమ్ అనుగ్రహింపబడతాడనీ, క్షమానుగ్రహం తిరస్కారికి ప్రాప్తంకాదనీ, ఇంకా, ముస్లిమ్ స్వర్గానికి వెళ్ళగా తిరస్కారి నరకానికి వెళతాడనీ ప్రతి ముస్లిమ్ తనలోతాను భావించుకుంటాడు. మీరున్నూ తప్పక ఇలాగే భావిస్తారనుకుంటా. ముస్లిమ్, తిరస్కారులలో ఇంత పెద్ద వ్యత్యాసం ఏ కారణాన సంభవిస్తుందో ఈ విషయం మీరిప్పుడు ఆలోచించాలని నా అభిలాష. తిరస్కారి కూడా ఆదమ్ (అలై) సంతానమే, మీరున్నూ అంతే! మీలాంటి మానవుడే తిరస్కారి కూడానూ. అతనూ కాళ్ళూ చేతులు, కళ్ళూ చెవులూ మీలాగే కలిగి ఉన్నాడు. అతనూ ఈ గాలిలోనే శ్వాసిస్తాడు, ఈ నీరే త్రాగు తాడు, ఈ భూమిపైనే నివసిస్తాడు, ఈ పంటలే భుజిస్తాడు, మీలానే జన్మిస్తాడూ మరి మీలానే మరణిస్తాడు. మిమ్మల్ని పుట్టించిన దేవుడే అతన్ని పుట్టించాడు. అయితే అతని అంతస్తు అధమంగానూ, మీది ఉన్నతమయి నదిగానూ ఎందుకు అయింది? మీకు

స్వర్గం ప్రాప్తించడమెందుకూ మరతనికి నరకం లభించడం దేనికి? ఈ విషయం కాస్త ఆలోచింపదగినది. మీరు అబ్దుల్లాహ్, అబ్దుర్రహ్మాన్ మరిలాంటి వేరే పేర్లతోనూ వారు దీన్‌దయాల్, గేండా సింగ్, రాబర్ట్‌సన్ లాంటి పేర్లతోనూ పిలువబడతారు. మీరు ఖత్నా (సున్నత్) చేయించుకోగా వారు చేయించుకోరు. మీరు మాంసాహారులు, వారు కారు. ఇలాంటి స్వల్ప కారణాల వల్లనే మనిషి మనిషిలో ఇంత గొప్ప వ్యత్యాసం సంభవించదుగదా! సర్వమానవులను సృష్టించిన దైవం, అందరికీ పాలకుడూ, పోషకుడయిన దైవం ఇంతటి అల్ప స్వల్ప విషయాల ఆధారంగా తన సృష్టిలో భేదభావం కనబరచి ఒక వ్యక్తిని స్వర్గానికి, మరొకణ్ణి నరకానికి పంపేటంతటి క్రూరుడు కాదు కదా!

అయితే ఈ ఉభయుల్లో నిజభేదమేమిటో ఆలోచించండి. దీనికి సమాధానం ఒక్కటే. ఇరువురిలో నిజభేదం ఇస్లామ్ (విశ్వాసం), కుఫ్ర్ (తిరస్కారం) కారణంగానే కలుగుతుంది. ఇస్లామ్‌నకు దేవుని విధేయత అనీ, కుఫ్ర్‌నకు దేవుని అవిధేయత అని భావం. ముస్లిమ్, తిరస్కారి ఇద్దరూ మానవులే, దేవుని దాసులే. కాని ఒక వ్యక్తి తన ప్రభువును గుర్తించిన కారణాన శ్రేష్ఠుడవుతాడు. అతను దైవాజ్ఞల్ని పాటిస్తాడు. దేవుని అవిధేయత వల్ల కలిగే పర్యవసానానికి భయపడుతాడు. రెండవ వ్యక్తి తన యజమానిని గుర్తించకపోవడం చేత తన నిజ స్థానాన్ని కోల్పోతాడు. ఆయన విధేయతను పాటించడు. అందుకే ముస్లిమ్ పట్ల దేవుడు తన ప్రసన్నత తెలుపుతాడు. తిరస్కారిని ఆగ్రహిస్తాడు. ముస్లిమ్‌నకు స్వర్గమిచ్చే వాగ్దానం చేశాడు. తిరస్కారిని నరకంలో పడవేస్తానని హెచ్చరించాడు.

దీన్నిబట్టి ముస్లిమ్, తిరస్కారులను వేరుపరిచే విషయాలు రెండే, ఒకటి జ్ఞానం మరొకటి ఆచరణ అని తేలింది. అంటే ముందు ఇతను తన

యజమాని ఎవరని, ఆయన ఆజ్ఞలేవనీ, ఆయన సమ్మతిపొందే ఆచరణ విధానమేదనీ, ఆయన ప్రసన్నుడయ్యే కార్యాలేవనీ, ఆయన ఆగ్రహించే పనులేవని తెలుసుకోవాలి. ఈ విషయాలు తెలుసుకున్న తదుపరి మనిషి తానై తన యజమానికి బానిస అయిపోవాలి, యజమాని సమ్మతి ఏదో దానిపై నడుచుకోవాలి. తన స్వేచ్ఛను వదలిపెట్టాలి. తన మనస్సు ఒక విషయాన్ని కోరినప్పుడు, ప్రభువాజ్ఞ దానికి విరుద్ధంగా ఉంటే తన మనో వాంఛను వినకుండా ప్రభువాజ్ఞను పాటించాలి. ఒక పని తనకు మంచిదని తోచినా, అది చెడ్డదని యజమాని అంటే దాన్ని చెడ్డదిగానే భావించాలి. మరొక కార్యం అతనికి చెడ్డదిగా గోచరించినా యజమాని అది మంచిదని అంటే దాన్ని మంచిదనే నమ్మాలి. ఒక కార్యంలో అతనికి నష్టం గోచరించినా ప్రభువాజ్ఞ దాన్ని చేయమంటే, అందులో ధన ప్రాణ నష్టం ఎంత కనబడినా దాన్ని చేసితీరాలి. మరొక పనిలో తనకు లాభం గోచరించినా దాన్ని చేయవద్దని యజమాని శాసించినప్పుడు సకల సౌభాగ్యాలు ఆ కార్యంలో లభించే సూచనలున్నప్పటికీ దాన్ని సుతరామూ చేయకూడదు.

"జ్ఞానం"తో పాటు ఈ "ఆచరణ" వల్లనే ఒక ముస్లిమ్ అల్లాహ్ ప్రియ దాసుడవుతాడు. అల్లాహ్ కరుణ అతనిపై వర్షిస్తుంది. దేవుడు అతనికి గౌరవం ప్రసాదిస్తాడు. తిరస్కారికి ఈ జ్ఞానమందు జ్ఞానం లేకపోవడంచేత ఆచరణ కూడా తదనుగుణంగా ఉండదు. అందువల్ల అతను దేవుని పట్ల అవిధేయునిగా, అజ్ఞానిగా రూపొందుతాడు. అల్లాహ్ తన కరుణ నుంచి దూరం చేస్తాడతన్ని.

ఇక మీరే న్యాయంగా ఆలోచించండి, ఒక వ్యక్తి తన్ను తాను ముస్లిమని అంటూ తిరస్కారిలాగే "అజ్ఞాని" అయితే, తిరస్కారిలా దేవునికి అవిధేయుడయితే కేవలం పేరూ, వస్త్రాలూ, అన్నపానాల వ్యత్యాసం వల్ల తిరస్కారి కంటే అతను ఏ విధంగా శ్రేష్ఠుడవుతాడు? ఏ కారణాన ఈ

లోకంలోనూ మరియు పరలోకంలోనూ దేవుని అనుగ్రహానికి పాత్రుడవు తాడు? 'ఇస్లామ్' తండ్రి నుంచి కొడుకుకూ, అతని నుంచి మనుమనికి తానై లభించడానికి, అది ఏదో వంశానికి, కుటుంబానికి లేక కులానికి పేరు కాదుకదా! ఒక బ్రాహ్మణుని కొడుకు ఎంత మూర్ఖుడైనా ఎంతటి దుష్ట క్రియలు చేసినా అతను ఉన్నతమైనవానిగానే ఎంచబడతాడు! కారణం? అతను బ్రాహ్మణుని ఇంట పుట్టాడు, ఉత్తమ జాతివాడు. కాని ఒక మాలవాని కొడుకు జ్ఞానమూ, సత్ ప్రవర్తనలబట్టి అన్ని విధాలా అతన్ని మించినవాడయినా అతనికన్నా నీచ మయినవానిగానే పరిగణింపబడతాడు. ఎందుకంటే మాలవాని ఇంట పుట్టాడు కాబట్టి క్షుద్రమైనవాడు! ఇస్లామ్‌లో అలా కాదు, ఇక్కడయితే దేవుడు తన గ్రంథంలో స్పష్టంగా ఆదేశించాడు :

> "దేవుని గుర్తించి ఇతోధికంగా ఆయన ఆజ్ఞాపాలన చేసే వాడే దేవుని దృష్టిలో గౌరవనీయుడు."

హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై) ఒక విగ్రహారాధకుని యింట జన్మించారు. కాని వారు దేవుణ్ణి గుర్తించారు. ఆయన ఆజ్ఞాపాలనజేశారు. అందుకే ఆయన్ని దేవుడు యావత్ ప్రపంచానికి నాయకునిగా చేశాడు. హజ్రత్ నూహ్ (అలై) కుమారుడు ఒక ప్రవక్త యింట పుట్టాడు. కాని దేవుణ్ణి గుర్తించలేదు. ఆయన ఆజ్ఞల్ని తిరస్కరించాడు. అందుకే అతని వంశాన్ని దేవుడు ఏ మాత్రమూ లెక్కజేయలేదు. అతన్ని దైవం శిక్షించిన రీతినిబట్టి లోకానికి నేటికీ దాని ద్వారా గుణపాఠం కలుగుతుంది.

కనుక ఒకటి మాత్రం బాగా అర్థం చేసుకోండి. మనిషి మనిషిలో దేవుని వద్ద వ్యత్యాసమంటూ ఉంటే అది జ్ఞానమూ, ఆచరణలనుబట్టి మాత్రమే ఉంటుంది. ఆయన్ని గుర్తించి, ఆయన చూపెట్టిన సరళ మార్గాన్ని ఎరిగినవారూ మరియు ఆయన ఆజ్ఞాపాలన జేసేవారికి మాత్రమే

ఈ లోకంలోనూ, పరలోకంలోనూ ఆయన అనుగ్రహం ప్రాప్తమవుతుంది. కాని ఎవరిలో ఈ గుణవిశేషాలుండవో వారి పేర్లు అబ్దుల్లాహ్, అబ్దుర్రహ్మాన్ అయినా లేక దీన్‌దయాల్, గేండా సింగ్ అయినా దేవుని వద్ద వీరిద్దరిలో ఎలాంటి భేదభావం లేదు. వీరికి దేవుని అనుగ్రహంలో ఎలాంటి హక్కూ ఉండదు.

సహోదరులారా! మేము ముస్లిమ్‌లమని చెప్పుకుంటారు మీరు. ముస్లిమ్‌లపై దేవుని అనుగ్రహం ఉంటుందని మీ విశ్వాసం. కాని మీపై దేవుని అనుగ్రహం వర్షిస్తుందా? కాస్త కళ్ళు తెరచి చూడండి. పరలోకంలో సంభవించబోయేదంతా తరువాత ఎలాగూ చూసుకుంటారు. కాని ఈ లోకంలో మీ స్థితి ఏమిటో దానిపై ఒకసారి దృష్టి సారించండి. నేటికీ కోట్ల సంఖ్యలో ఉన్నారు మీరీ దేశంలో. ఇంత పెద్ద సంఖ్య ఇస్లామ్ జీవమూ, విశ్వాస శక్తినీ కలిగివుంటే మీరిక్కడ నిస్సహాయులుగా, విలువహీనులుగా ఉండేవారు కారు. దైవానికి తప్ప ఇతరుల ఎదుట ఒగ్గని మీ తల ఇలా మానవుల ముందు ఒగ్గి ఉండదు. ఒకరు వ్రేలెత్తి చూపలేని మీ గౌరవమర్యాదలు నేడిలా మట్టిపాలయ్యేవీ కావు. మూఢత్వం, దారిద్ర్యం, ఋణబాధలు మిమ్మల్ని ఇలా నీడలా వెంటాడి ఉండేవికావు. కాని వాస్తవంగా ఇవన్నీ మీలో ఉన్నాయి ఆలోచించండి. ఇదేనా దైవానుగ్రహం? ఇది అనుగ్రహం కాదు. నిస్సందేహంగా ఆగ్రహమే. అయితే, ఎంత వింత? ముస్లిమ్‌లపై దేవుని ఆగ్రహం కూడానా? ముస్లిమై హీనదశకు దిగజారిపోవడమా? ముస్లిమై తోటి మానవులకు బానిస అవడం కూడా సాధ్యమా? ఒక వస్తువు ఒకే సమయంలో తెల్లదిగానూ, నల్లదిగానూ కానంతటి అసంభవ విషయమిది. ముస్లిమ్, దేవునికి ప్రియమైనవాడే అయితే, దేవుని అభిమానానికి పాత్రుడైన వాడు, అవమానమూ దుర్దశలకు ఎలాలోనవుతాడు? మీరు ఆయన పట్ల

తమ విధిని గుర్తించి ఆయన ఆజ్ఞాపాలన చేస్తుంటే, మీ విధేయతకు ప్రతిఫలంగా తనకు అవిధేయులైనవారిని మీపై పాలకులుగా చేసి మిమ్మల్ని, శిక్షించడానికి మీ దేవుడేమైన క్రూరుడా? (దైవం క్షమించుగాక!) దేవుడు క్రూరుడు కాడని మీ విశ్వాసమైతే, దేవుని విధేయతకు ప్రతిఫలం ఈ హీన దశ రూపంలో దొరకజాలదని మీరు గాఢంగా నమ్మితే ముస్లిమ్‌లమని మీరు చేసే వాదంలో ఏదో లోపముందని ఒప్పుకుని తీరవలసిందే. ప్రభుత్వ పట్టికల్లో మాత్రం ముస్లిమ్‌లని మీ పేరే సరిగానే వ్రాయబడి ఉంది. కాని, దేవుని సన్నిధిలో ఇతర ప్రభుత్వపు జాబితాల నిర్ధారణపై తీర్పు జరగదు. తన జాబితా వేరే పొందుపరచి ఉంటాడు దేవుడు, అక్కడ అన్వేషించండి. మీ పేరు విధేయుల్లో ఉందో లేక అవిధేయుల్లో వ్రాయబడివుందో?

దేవుడు మీ వద్దకు గ్రంథం పంపాడు - ఎందుకూ? మీరు దాన్ని పఠించి తమ ప్రభువును గుర్తించాలనీ, ఆయన విధేయతా విధానాన్ని తెలుసుకోవాలని. అయితే ఆ గ్రంథంలో ఏముందో మీరేనాడయినా తెలుసుకునేందుకు ప్రయత్నించారా? తన ప్రవక్తను మీ వద్దకు పంపాడు దేవుడు - దేనికి? ముస్లిమయ్యే పద్ధతి మీకు నేర్పడానికి. ఆ ప్రవక్త ఇచ్చిన శిక్షణ ఏమిటో తెలుసుకునేందుకు ఎప్పుడైనా ప్రయత్నించారా? ఇహ పరలోకాలలో గౌరవం, ఔన్నత్యం పొందే మార్గం చూపెట్టాడు దేవుడు. మీరా మార్గాన్ని అనుసరిస్తున్నారా? ఇహ పర లోకాలలో మనిషి పతనానికీ, అవమానాలకు గురి అయ్యే పనులేవో దేవుడు తరచి తరచి తెలిపాడు. ఇలాంటి పనుల నుంచి దూరంగా ఉంటున్నారా మీరు? ఈ ప్రశ్నలకు మీ సమాధానాలేమిటి? దేవుడు గ్రంథమూ, ఆయన ప్రవక్త జీవితం ద్వారా జ్ఞానాన్ని పొందనూ లేదు. మరి ఆయన సూచించిన మార్గాన్ని అనుసరించనూలేదని మీరే అంగీకరిస్తే ఇక ముస్లిములెప్పుడయ్యారు మీరు, దాని

ప్రతిఫలం మీకు ఎలా లభిస్తుంది? మీరెలాంటి ముస్లిములో అలాంటి ప్రతిఫలం మీకు లభిస్తూనే ఉంది. అలాంటి ప్రతిఫలమే పరలోకంలోనూ మీరు వీక్షించగలరు!

నేనింతకు ముందే వివరించాను, ముస్లిమ్ - తిరస్కారిలో జ్ఞానమూ, ఆచరణ తప్ప మరో భేదం లేదు. ఒక తిరస్కారికి తెలిసినంతే ముస్లిమ్ వ్యక్తికి కూడా తెలిసి ఉన్నప్పుడు తాను ముస్లిమ్‌నని అతను చాటుకుంటే అతని మాట శుద్ధ అబద్ధం. తిరస్కారి పవిత్ర ఖుర్ఆన్‌ని పఠించడు, అందులో ఏమని వ్రాయబడివుందో ఎరుగడు. ఒక ముస్లిమ్ పరిస్థితి కూడా ఇంతే అయివుంటే అతను ముస్లిమని పిలవబడటం దేనికి? మహాప్రవక్త (సఅసం) బోధన ఏమిటి, దేవుణ్ణి చేరే సరళ మార్గం ఆయన చూపినదేదో ఒక తిరస్కారి ఎరుగడు. ముస్లిమ్ కూడా ఇలాగే తెలియకుండా ఉంటే అతను ముస్లిమ్ ఎలా అయ్యాడు? దేవుని ఇష్టానుసారంగా జీవించక తన ఇష్టానుసారంగా నడుచుకుంటాడుతిరస్కారి. ఇతనిలాగే స్వేచ్ఛావిహారుడు, స్వతంత్రుడు, సొంత ఆలోచనా, సొంత అభిప్రాయాలపై నడిచేవాడు, దేవునితో ప్రమేయం లేకుండా తన కాంక్షలకు దాసుడు అయిన ఒక వ్యక్తికి తన్నుతాను ముస్లిమ్ (దేవుని విధేయుడు) అని చెప్పుకునే అధికారం ఎక్కడిది? తిరస్కారి, హలాల్(ధర్మమైన), హరామ్(అధర్మమైన) వాటిలోగల తారతమ్యాన్ని పాటించడు. ఏ కార్యంలో తనకు లాభమూ లేక సంతోషమూ, ఆస్వాదన లభిస్తాయో దాన్ని అనుసరిస్తాడు - అది ధర్మసమ్మతమైనదయినా, అధర్మమయిన దయినా అతనికి ఒక్కటే! ఒక ముస్లిమ్ ప్రవర్తనా స్వభావాలు ఇలాంటివే అయితే ఇతనిలోనూ మరొక తిరస్కారిలోనూ గల భేదమేమిటి? మొత్తం మీద తిరస్కారిలాగే ఒక ముస్లిమ్ కూడా ఇస్లామ్ శిక్షణల ఎడల గ్రుడ్డివానిగా ప్రవర్తిస్తే, తిరస్కారి చేసే కార్యాలే, ముస్లిమ్ సయితం

చేస్తే ఇతనికి తిరస్కారి కంటే అధికమయిన స్థానం ఎందుకు లభించాలి? ఇతని అంత్య పరిణామం తిరస్కారిలా ఎందుకు కాకూడదు? మనమందరమూ ప్రశాంత హృదయంతో యోచింపదగ్గ విషయమిది.

ప్రియ సోదరులారా! ముస్లిములను నేను తిరస్కారులుగా చేసివేస్తున్నానని అనుకోబోయేరు. దైవం రక్షించుగాక! కాదు, నా ఉద్దేశ్యం అది కాదు. చెప్పొచ్చేదేమిటంటే, మనం దేవుని అనుగ్రహానికి ఎందుకు దూరమయ్యాము? అన్ని దిశల నుంచి మనపై కష్టాలెందుకు ఆసన్నమవుతున్నాయి? 'దేవుని అవిధేయులయిన తిరస్కారులు' అని మనం చెప్పుకునేవారే మనపై సర్వత్రా సర్వాధికారులుగా ఉండగా దైవ విధేయులమని దావా చేసుకునే మనం అన్ని చోట్ల వారికి లొంగివున్నామెందుకు? ఈ విషయాలపై నేను స్వయంగా ఆలోచిస్తూ ఉంటాను. మనలోని ప్రతి వ్యక్తి ఆలోచించాలని అభిలషిస్తున్నాను. వీటి కారణాలపై నేనెంతగా ఆలోచించానో అంతగానే మనలోనూ తిరస్కారులలోనూ కేవలం పేరొక్కటే వ్యత్యాసంగా ఉండిపోయిందన్న విషయంపై అతి గాఢంగా విశ్వాసం కుదిరిపోతూవుంది. కాకపోతే ఏమిటి? దేవుని పట్ల అశ్రద్ధ, అజాగ్రత్త, నిర్భయం, అవిధేయతలలో మనం వారిని ఏ మాత్రమూ తీసిపోలేదు. ఏదో కాస్త వ్యత్యాసం మనకూ వారికీ ఉంది. కాని దానివల్ల సత్ఫలితానికి అర్హులం కాము. శిక్షాపాత్రులమే అవుతాము. ఎందుకంటే, పవిత్ర ఖుర్ఆన్ దైవ గ్రంథమని తెలిసి ఉన్నప్పటికీ, తిరస్కారి దాని ఎడల ఎలా ప్రవర్తిస్తాడో అలాగే మనమూ వ్యవహరిస్తున్నాం. ముహమ్మద్(సల్లల్లాహు అలైహి వ సల్లం) దైవ ప్రవక్తని మనకు తెలిసినప్పటికీ ఆయన అనుకరణ నుంచి తిరస్కారిలాగే పలాయనమవుతుంటాము. అబద్ధమాడేవానిపై దేవుని అభిశాపముందనీ, లంచం ఇచ్చేవానికి పుచ్చుకునేవారికి దేవుడు

నరకం నిశ్చయమన్నాడనీ, వడ్డీ తినేవారినీ తినిపించేవానినీ అత్యంత నీచమయిన దోషులుగా నిర్ణయించాడనీ, చాడీలను, తోటి సోదర దేహ మాంసాన్ని భుజించడంతో సమానం అన్నాడనీ, అశ్లీలతకు, నిర్లజ్జతకు, దుష్ట క్రియలకు కఠిన శిక్షల హెచ్చరిక దేవుడు చేసి ఉన్నాడనీ మనందరికీ తెలిసిన విషయమే. కాని తిరస్కారులలానే (అవిశ్వాసులలానే) ఈ కార్యాలన్నీ స్వేచ్ఛగా మనం చేస్తుం టాము. అంటే మనకు దైవ భీతి లేదన్నమాట. ఈ కారణంగానే తిరస్కారుల సమక్షంలో మనం ఏ కొద్దో గొప్పో ముస్లిములైనట్లు కనిపించి నందుకు ఇవ్వబడుతూ ఉన్నది పారితోషికం కాదు, శిక్ష. ఇలా మనపై తిరస్కారుల పాలకులవడం, సర్వత్రా మనం పరాజయమూ పరాభవమూ పొందడం, ఇవన్నీ ఇస్లామ్ లాంటి మహా ప్రసాదం మనకు లభించగా దాన్ని మనం అనుసరించకుండా చేసిన అపరాధానికి శిక్షలే!

మిత్రులారా! నేటి ప్రసంగంలో చెప్పినదంతా మిమ్మల్ని నిందించడానికి కాదు. నేను నిందించడానికి బయల్దేరలేదు. కోల్పోయినదాన్ని తిరిగి పొందే ఆలోచన చేయాలన్నదే నా ఉద్దేశ్యం. కోల్పోయిన వస్తువేదో, అది ఎంత విలువయినదో మనిషికి తెలిసినప్పుడే దాన్ని తిరిగి పొందే చింత కలుగు తుంది. అందుకే మిమ్మల్ని మేల్కొలిపే ప్రయత్నం చేస్తున్నాను. మీ వద్ద ఉండిన వస్తువు వాస్తవంగా అమూల్యమైనదే అని గుర్తించారంటే దాన్ని తిరిగి పొందే యోచన చేస్తారు.

ముస్లిమవడానికి, ఒక ముస్లిమ్‌కు అత్యావశ్యమైన వస్తువు ఏదయితే ఉందో అది ఇస్లామ్‌ను గురించిన జ్ఞానమేనని గత ప్రసంగంలో వివరించి ఉన్నాను. ఖుర్ఆన్ శిక్షణలేమిటి? దివ్య ప్రవక్త ఆచరణ విధానాలేమిటి? ఇస్లామ్, కుఫ్ర్‌ల మధ్య ఏ విషయాల వల్ల నిజభేదం కలుగుతుంది? అనే విషయాలు ప్రతి ముస్లిమ్ క్షుణ్ణంగా తెలుసుకోవాలి. ఈ జ్ఞానం లేకుండా ఏ

వ్యక్తీ ముస్లిమవజాలడు. కానీ ఎంత శోచనీయం! ఈ జ్ఞానాన్ని పొందే ఆలోచనే చేయరు మీరు. ఎంత గొప్ప ప్రసాదానుగ్రహాన్ని కోల్పోయారో మీకింకా సరిగా అవగాహన కాలేదని దీన్నిబట్టి అర్థమవుతుంది. సోదరులారా! పసివాడు ఏడ్చి అడగనంతవరకు తల్లి పాలివ్వదు. దాహమవుతే దప్పికగొన్న వాడు స్వయంగా నీళ్ళకై అన్వేషిస్తాడు. దేవుడు అతని కోసం నీళ్ళు ఉద్భవింప చేస్తాడు. మీకు స్వయంగా దప్పికలేనప్పుడు నీటితో నిండిన బావి ఎదురయినా అనర్థకం. దీన్ (సన్మార్గ) శిక్షణను తెలుసుకోకపోవడం వల్ల మీకెంతటి నష్టం చేకూరుతుందో మీరే స్వయంగా గ్రహించాలి. దైవ గ్రంథం మీ వద్ద ఉంది. కాని అందులో వ్రాయబడి ఉన్నదేదో మీకే తెలియదు. ఇంతకన్నా నష్టదాయకమైన విషయం వేరొకటి ఏముంది? మీరు నమాజ్ (ప్రార్థన) చేస్తారు. కాని నమాజ్‌లో తమ దేవుని సన్నిధిలో ఏమని వేడుకుంటారో మీకే తెలియదు. ఇంతకంటే గొప్ప నష్టమేముంది? ఇస్లామ్‌లో మీరు ఏ కలిమా (సద్వచనం) పఠించి ప్రవేశిస్తారో దాని భావమైనా మీకు తెలియదు. ఈ కలిమాను పఠించగానే మీపై ఎలాంటి బాధ్యతలు తారసిల్లుతాయో మీరెరుగరు. ఇంతకంటే అధికమయిన నష్టం ఒక ముస్లిమ్‌కు వేరొకటి కాగలదా? పొలాలు ఎండిపోతే కలిగే నష్టం మీకు తెలుసు. జీవనోపాధి దొరకకపోతే కలిగే నష్టం మీకు తెలుసు. మీ సంపద కోల్పోతే కలిగే నష్టం మీకు తెలుసు. కాని ఇస్లామ్ శిక్షణలను ఎరుగకపోతే కలిగే నష్టం మీకు తెలీదు. ఆ నష్టం అనుభూతి మీకు కలిగినప్పుడు మీరే స్వయంగా వచ్చి 'అయ్యో! మమ్మల్ని ఈ నష్టాన్నుంచి ఎవరయినా రక్షిస్తే బాగుండు'నని కోరుతారు. మరి మీరే స్వయంగా కోరినప్పుడు ఇన్షా అల్లాహ్ (దైవం తలిస్తే) మిమ్మల్ని ఈ నష్టాన్నుంచి రక్షించే ఏర్పాటు కూడా జరుగుతుంది!

* * *

# గమనార్హ విషయాలు

ముస్లిమ్ సోదరులారా! ప్రపంచంలో ప్రస్తుతం ముస్లిములే గొప్ప అదృష్ట వంతులయినవారు. వీరి వద్దనే దైవ ప్రబోధం ఎలాంటి మార్పులు చేర్పులూ లేకుండా, పరిశుద్ధంగా, దేవుని సత్సందేశహరునిపై ఏ పద సమూహంతో అవతరించిందో సరిగ్గా ఆ పద సమూహంతోనే సురక్షితంగా ఉంది. మరి ప్రపంచంలోకెల్లా అతి దురదృష్టవంతులైనవారున్నూ ప్రస్తుతం ముస్లిములే - దైవ సూక్తులు తమ వద్ద ఉంచుకుని వాటి శుభలాభాలూ అగణ్య ప్రసాదానుగ్రహాలు పొందజాలకున్నారు. దాన్ని చదివి, అర్థం చేసుకుని, దాని ప్రకారం ఆచరించాలనీ, దాని ఆధారంగా భువిలో దైవ ప్రభుత్వం నెలకొల్పాలనీ పవిత్ర ఖుర్ఆన్ వీరికి ఒసగబడింది. ఇది వీరికి గౌరవ మర్యాదలు ప్రసాదించడానికి వచ్చింది. వీరిని భూమిపై దేవుని నిజ ప్రతినిధులుగా రూపొందించడానికి వచ్చింది. చరిత్ర కూడా ఇది నిజమని సాక్ష్యమిస్తుంది. దీని ఆదేశాల ప్రకారం వీరు ఆచరించినప్పుడు వీరిని ఇది లోకనాయకులుగా, అధినేతలుగా చేసి చూపెట్టింది. దీన్ని యింట్లో ఉంచుకుని భూత ప్రేతాలను వెడలకొట్టడం, దీని ఆయత్‌లను (వాక్యాలను)

వ్రాసి మెడలో తాయెత్తుగా కట్టుకోవడం, వాటిని నీటిలో రంగరించి త్రాగడం, కేవలం పుణ్యార్జన కోసమంటూ అర్థం చేసుకోకుండానే పారాయణం చేయడం – ఇవే వీరి వద్ద ఇప్పుడు ఉన్న ప్రయోజనాలు. తమ జీవిత వ్యవహారాలకై మార్గదర్శక సూచనలు ఇప్పుడు దీనిద్వారా పొందరు వీరు. నమ్మకాలు ఏమై ఉండాలి? ఆచరణలెలా ఉండాలి? మన నైతికత ఎలా ఉండాలి? ఇచ్చిపుచ్చుకోవడాలు మనమేవిధంగా జరపాలి? మైత్రీ శత్రుత్వాలలో పాటించవలసిన నిబంధనలేవి? మనపై ఉన్న తోటి మానవుల హక్కులు ఏవి? మన ఆత్మ హక్కులేవి? వాటిని మనమెలా నిర్వర్తించాలి? ఏది సత్యం, ఏది అసత్యం? ఎవరికి విధేయులై ఉండాలి? ఎవరి ఆజ్ఞాపాలన చేయకూడదు? మన మిత్రులెవరు? శత్రువులెవరు? ఏ విషయాల్లో మనకు గౌరవమూ, సుఖశ్రేయాలు, సఫలతలు లభిస్తాయి? పరాభవమూ, అసఫలత, నష్టాలెందులో ఉన్నాయి? ఈ విషయాలన్నీ ముస్లిమ్‌లు పవిత్ర ఖుర్‌ఆన్‌ని అడగటం మానివేశారు. ఇప్పుడు భౌతికవాదుల్ని, ధర్మభ్రష్టకుల్ని, తిరస్కారులనూ, బహు దైవారాధకుల్నీ, మార్గ విహీనుల్నీ, స్వార్థాభిలాషుల్ని మరియు స్వయంగా తమ మనసులోని షైతాన్‌ని అడిగి తెలుసుకుంటున్నారు. ఇంకా వారి ఆదేశాలపైనే నడుస్తున్నారు. అందుకే దైవాన్ని వదలి ఇతరుల ఆజ్ఞలపై నడిచే ఫలితమే వారికి ప్రాప్తమయింది. దాన్నే మీరు నేడు ప్రతి చోటా అనుభవిస్తున్నారు. హిందూ దేశంలోనూ, చైనా, జావా, పాలస్తీనా, సిరియా, అల్జీరియా, మొరాక్కోలలోనూ!

దివ్య ఖుర్‌ఆన్, శుభాలకు పుట్టిల్లు. ఎలాంటి శుభం మీరెంతగా కోరినా ఇది మీకు ఇస్తుంది. కేవలం భూత ప్రేతాలను వెడలగొట్టటం, దగ్గూ జ్వరాలకు చికిత్స, అభియోగాల విజయం, ఉద్యోగ ప్రాప్తి మరిలాంటివే నీచ విషయాల్ని దీని ద్వారా మీరు కోరినట్లయితే ఇవే లభిస్తాయి. గౌరవ

ఔన్నత్యాలూ, ప్రపంచ నాయకత్వమే కోరితే అదీ లభిస్తుంది. దైవ దివ్యాసన సన్నిధిని పోగోరితే మిమ్మల్ని అక్కడికి చేర్చుతుంది ఇది. మహా సముద్రం నుంచి రెండే నీటిబొట్లను కోరుతున్నది మీ సంకుచిత అంజలియే కాని, సముద్రమయితే మహా నదులనే ప్రసాదించడానికి సిద్ధంగా ఉంది.

మహాశయులారా! దేవుని ఈ పవిత్ర గ్రంథంతో మన సహోదరులు ఆడే చెలగాటం ఎంత హాస్యాస్పదమైనదంటే వేరొక విషయంలో ఎవరయినా ఈ చేష్టలే చేస్తే మీరే అతన్ని హేళన చేస్తారు. పిచ్చివాడిగా పరిగణిస్తారు. కాస్త మీరే చెప్పండి. వైద్యుని వద్ద ఒక వ్యక్తి ఔషధ నిర్ణయ పత్రం (Prescription) వ్రాయించి తెచ్చి దాన్ని ఒక పేలికలో చుట్టి తావిత్తుగా మెడలో వేసుకుంటే, లేదా దాన్ని నీటిలో రంగరించి త్రాగితే అతన్ని మీరు ఏమని అంటారు? అతన్ని చూచి నవ్వరా? కాని మీ వ్యాధులకు అత్యంత గొప్ప వైద్యుడు ప్రసాదించిన నివారణ, కరుణానుగ్రహాల అద్వితీయమయిన ప్రిస్క్రిప్షన్‌తో రేయింబవళ్ళు మీ కనుల ముందు ఈ విధంగానే వ్యవహరించ బడుతోంది. కాని దాన్ని చూచి ఎవరికీ నవ్వు రాదు. ఔషధ పత్రం తావిత్తుగా వేసుకునే, నీటిలో రంగరించి త్రాగే వస్తువు కాదనీ, దాని సూచనల ప్రకారం మందు వాడేందుకే అది ఉపయోగపడుతుందని ఎవరూ ఆలోచించరు.

ఒక వ్యక్తి వ్యాధిగ్రస్తుడయ్యాడని అనుకోండి. అతను వైద్య శాస్త్రానికి సంబంధించిన పుస్తకాన్ని ఒకదాన్ని తీసుకుని దాని పఠనకు ఉపక్రమిస్తూ, ఈ గ్రంథాన్ని చదివినంత మాత్రాన వ్యాధి నివారణ అవుతుందని భావిస్తే అతన్ని మీరేమంటారు! "పంపండి ఇతన్ని పిచ్చాసుపత్రికి, ఇతని మతి చెడి పోయింది" అని చెప్పరా? కాని మీ వ్యాధుల చికిత్స కొరకు ఏకైక నివారణ కర్త పంపిన గ్రంథం ఎడల మీ ప్రవర్తన ఈ రీతిలోనే ఉంది. మీరూ దాన్ని

పఠిస్తారు, అంతే. దాన్ని చదువుకున్నంత మాత్రాన రోగాలన్నీ దూరమవు తాయని తలుస్తారు. దాని ఆదేశాలపై ఆచరణ అవసరం లేదు. అది హానికరాలుగా సూచించిన వస్తువుల నిషేధమూ అవసరం లేదు. తన వ్యాధి నివారణకై వైద్య శాస్త్ర గ్రంథాలను పఠించడం మాత్రమే చాలని అనుకునే రోగిని గురించి చేసిన తీర్పును మీరు మీ స్వయం పట్ల తీర్మానించుకో రెందుకూ?

మీరు ఎరుగని భాషలో మీకు ఏదయినా ఉత్తరం వస్తే ఆ భాష తెలిసిన వ్యక్తి వద్దకు దాని భావమడిగేందుకు పరుగెత్తుకుని వెళతారు. దాని భావం తెలుసుకునేంతవరకు మీకు స్థిమితముండదు. సాధారణ వ్యావహారిక ఉత్తరాల ఎడల మీ ప్రవర్తన ఇలా ఉంది. మహా అంటే నాలుగు కాసుల లాభం దీనివల్ల కలుగవచ్చు. కాని మీ ఇహపరాల సర్వలాభాలు ఇమిడి ఉన్న సర్వలోక ప్రభువు పత్రం మీ వద్దకు వచ్చి ఉందే, దాన్ని ఇట్టే వదలిపెట్టేస్తారేం? దాని భావం తెలుసుకోడానికి మీలో ఎలాంటి కుతూహలం అంకురించదేం? ఎంత విచిత్రంగా ఉంది మీ ప్రవర్తన?

నేనీ విషయాలు ఏదో వేళాకోళానికి, కాలక్షేపానికి వివరించడం లేదు. ఈ విషయాలపై శ్రద్ధగా యోచించారంటే ప్రపంచంలో అత్యంత అత్యాచారం దేవుని ఈ గ్రంథం పట్ల జరుగుతుందని మీ హృదయమే పలుకుతుంది. ఈ అత్యాచారం చేసేవారు వేరే ఎవరూ కారు, ఈ గ్రంథంపై తమకు విశ్వాస ముందని, దానికై ప్రాణాలను కూడా బలి ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నామని ప్రకటించేవారే. నిస్సందేహంగా దీనిపై వారికి నమ్మకముంది. దీన్ని ప్రాణాలకన్నా ప్రియతర వస్తువుగా పరిగణిస్తారు కూడా. కాని వీరే దీని పట్ల అత్యంత అపచారం చేయడం ఎంత శోచనీయం! దైవ గ్రంథానికి అపచారం చేస్తే

కలిగే ఫలితం కనబడుతూనే ఉంది. ఒకటి మాత్రం బాగా తెలుసుకోండి. మానవుని వద్దకు దైవవాణి వచ్చిందంటే అది అతన్ని దురదృష్టం, దుర్దశ, కష్టాలపాలు చేయడానికి మాత్రం కాదు.

**"తాహా (ఓ ప్రవక్తా!) ఈ ఖుర్ఆన్ మిమ్మల్ని విపత్తులో వేయడానికిగాను మేము మీపై అవతరింపజేయలేదు."** *(20 : 1)*

అది శుభానికి – సౌభాగ్యానికి సరోవరం. దారిద్ర్యానికి, దౌర్భాగ్యాలకు మార్గం కాదు. దైవాదేశాలు పొంది ఉన్న జాతి ప్రపంచంలో పరాభవమూ, దుర్దశ పాలవటం, ఇతరుల పాలనకు లొంగి ఉండటం, ఇతరుల కాళ్ళ క్రింద చితికి చెప్పుదెబ్బలు తిని చీవాట్లుపడి ఉండటం, మెడలో బానిసత్వపు బంధనాలుండి ఇతరుల చేతుల్లో వాటి పగ్గాలుండి వారు ఈ జాతిని పశువులను తోలినట్లు తోలడం, ఇదంతా అసంభవం. దైవ సూక్తుల పట్ల అపచారం చేసిననాడు మాత్రమే ఈ దుష్ఫలితం దానికి కలుగుతుంది. బనీ ఇస్రాయీల్ (ఇస్రాయిలీయుల) అంత్యం మీ ముందుంది. వారి వద్ద తౌరాహ్, బైబిల్ పంపబడ్డాయి. వారి గురించి ఈ విధంగా చెప్పబడింది:

**"వారు తౌరాహ్, బైబిల్, ఇంకా వారి వద్దకు పంపబడిన వేరే గ్రంథాల అనుసరణపై స్థిరచిత్తంతో ఉండి ఉంటే జీవనోపాధి ఆకాశం నుండి వారిపై వర్షించేది. భూమిలో నుంచి పొంగివచ్చేది!" (5 : 66)**

కాని వారు దైవ గ్రంథాల ఎడల అపచారం చేశారు. దాని ఫలితం ఇలా పొందారు:

**"దురవస్థా, దారిద్ర్యమూ వారిపై అవతరింపబడ్డాయి. వారు దైవాగ్రహానికి గురయ్యారు. ఇలా జరగడానికి కారణమేమిటంటే, వారు దైవ**

సూక్తుల్ని తిరస్కరించారు. దైవ ప్రవక్తలను అధర్మంగా హత్య చేశారు. ఇంకా దైవ ధిక్కారులూ, హద్దుమీరినవారూ అయ్యారు."

(2 : 61)

కనుక ఒక జాతి దైవ గ్రంథాన్ని పొందివుండీ, దుర్దశకూ, హీనస్థితికి గురిఅయి, పాలిత జాతిగా ఇతరుల అధికారానికి లొంగివుంటే, అది దైవ గ్రంథం పట్ల తప్పక అత్యాచారం చేసి ఉండాలనీ, దాన్ని ఆవరించిన ఈ దైవాగ్రహమంతా వారి అపచారార్జితమని తెలుసుకోండి. ఈ దైవాగ్రహాన్నుంచి విమోచనం పొందాలంటే ఈ గ్రంథం ఎడల అపచారం చేయడం మానివేసి దాని ఎడల మీ కర్తవ్యాన్ని నెరవేర్చడానికి ప్రయత్నించడం అనివార్యం. మీరు ఈ మహా పాతకాన్ని మానివేయకపోయారంటే మీ పరిస్థితి ఏనాటికీ మారబోదు – గ్రామానికొక కాలేజి తెరచినా, మీలో ప్రతి వ్యక్తీ గ్రాడ్యుయేట్ అయినా, ఇంకా యూదుల్లా మీరూ వడ్డీ వ్యాపారంజేసి కోటీశ్వరులే అయినా అంతే!

మహాశయులారా! ప్రతి ముస్లిమ్ అన్నిటికన్నా ముందుగా తెలుసుకోవలసిన విషయమేమంటే, 'ముస్లిమ్' అని ఎవరిని అంటారు? 'ముస్లిమ్' అన్న పదానికి అర్థమేమి? మానవునికి, "మానవత్వం" ఏమిటో, మానవునికీ–పశువుకూ గల వ్యత్యాసమేమిటో తెలియకపోతే అతను పశువులా ప్రవర్తిస్తాడు. తన మానవత్వానికి తగిన విలువ ఇవ్వజాలడు. ఇదే విధంగా ఒక వ్యక్తికి ముస్లిమవడమంటే ఏమిటో, ముస్లిమ్‌లకు ముస్లిమేతరులకు మధ్య వ్యత్యాసమెలా సంభవిస్తుందో తెలియకపోతే అతను ముస్లిమేతరునిలానే ప్రవర్తిస్తాడు. తను ముస్లిమవడానికి సరిగ్గా విలువ ఇవ్వలేడు. కాబట్టి ముస్లిమ్‌ల పెద్దలు, పిల్లలు అందరూ తాము ముస్లిమ్‌లమని చెప్పుకునే దానికి అర్థమేమిటో, ముస్లిమనగానే మనిషి యొక్క స్థితిగతుల్లో ఎలాంటి మార్పు తారసిల్లుతుందో, అతనిపై

ధ్యతలు ఆసన్నమవుతాయో, ఇస్లామ్ సూచించే ఏ పరిధులలో ఉండి క్తి ముస్లిమ్‌గా ఉండగలడో మరియు నోటితో ముస్లిమని చాటుకున్నా, ధుల వెలుపల అడుగుపెట్టగానే అతను ఇస్లామ్ నుంచి దూరమవుతాడో తా క్షుణ్ణంగా తెలుసుకోవడం ఎంతయినా అవసరం.

"ఇస్లామ్" అంటే దైవాజ్ఞాపాలన, విధేయత అని అర్థం. తన్ను తానై దైవానికి అంకితమయిపోవడమే "ఇస్లామ్". దేవుని సమక్షంలో తన స్వతంత్రత, స్వాధికారాలను త్యజించడమే "ఇస్లామ్." దేవుని ప్రభుత్వమూ అధికారాల ముందు విధేయతతో తలవంచడమే "ఇస్లామ్." తన వ్యవహారాలన్నింటినీ దైవాధీనం చేసిన వ్యక్తే ముస్లిమ్. మరియు తన వ్యవహారాలను తన అధీనంలోనే ఉంచుకునే వ్యక్తి లేక దైవం కాక మరొకరి హస్తగతం జేసే వ్యక్తి ముస్లిమ్ కాజాలడు. దైవాధీనంలో వదలడమంటే లేదా దేవుని హస్తగతం చేయడమంటే దైవం తన గ్రంథమూ, తన ప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) ద్వారా పంపిన ఆదేశాలను స్వీకరించాలి. వాటిని ఆచరించడానికి ముందు, ఎందుకూ? దేనికి? అని ప్రశ్నించకూడదు. జీవితంలో ఎదురయ్యే ప్రతి వ్యవహారంలోనూ పవిత్ర ఖుర్ఆన్, "సున్నతె రసూల్" (ప్రవక్త సంప్రదాయం)ని అనుసరించాలి. తన వాంఛలను, లోక రీతిని దైవం తప్ప అన్యుల ప్రతి ఒక్క మాటనూ ప్రక్కకు నెట్టివేసి, ప్రతి విషయంలోనూ దైవ గ్రంథాన్నీ, మహాప్రవక్తను తాను, చేయవలసినది ఏది? ఏది చేయకూడదు? అని అడిగి అటు నుంచి లభించిన ఆదేశాలను జంకుగొంకు లేకుండా స్వీకరించి దానికి విరుద్ధమైన ప్రతి విషయాన్నీ తిరస్కరించే వ్యక్తియే ముస్లిమ్. ఎందుకంటే అతను తన సర్వస్వాన్ని దేవుని అధీనం చేశాడు. 'ముస్లిమ్' అవడమంటే తన్నుతాను దైవానికి అధీనం అవడమే!

దీనికి విముఖంగా, ఒక వ్యక్తి ఖుర్ఆన్, ప్రవక్త సంప్రదాయాల మీద ఆధారపడక తన మనసు ఇచ్చే ఆదేశాలను ఆచరిస్తాడు; లేదా వంశపారంపర్యంగా

జరుగుతూ వచ్చే ఆచారాల్ని అనుసరిస్తాడు; లేదా ప్రపంచంలో అందరూ పాటిస్తున్న రీతినే పాటిస్తాడు; తన వ్యవహారాల పట్ల, తాను ఏమి చేయాలో అన్న విషయంలో ఖుర్ఆన్, సున్నత్‌లను విచారించే అగత్యమే అనుకుంటాడు. ఒకవేళ ఖుర్ఆన్, సున్నత్‌ల సూచనలు "ఇవి" తెలిసినప్పటికీ వాటికి బదులుగా, "నా బుద్ధి దీన్ని స్వీకరించదు కాబట్టి మాట నేనంగీకరించను;" లేక "మా వంశంలో దీనికి విరుద్ధంగా ఆచర. జరుగుతూ వస్తూంది; కనుక నేను దీనిని అనుసరించను" లేక "లోక రీతి దీనికి భిన్నంగా ఉంది గనుక, నేను లోక రీతి ప్రకారమే ఆచరిస్తాను" అంటాడు. ఇలాంటి వ్యక్తి ముమ్మాటికీ ముస్లిమ్ కాడు. అతను తన్ను ముస్లిమని చాటుకుంటే అది శుద్ధ అబద్ధం.

మీరు "లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్" (ఆరాధనా విధేయతలకు అర్హుడు దేవుడు ఒక్కడే, ముహమ్మద్(స) దేవుని సందేశహరులు) అనే కలిమా పఠించి ముస్లిమయినట్లు స్వీకార ప్రకటన చేసిన క్షణమే మీకు ఆచరణ యోగ్యమైన శాసనం దైవ శాసనం మాత్రమే అనీ, మీ పాలకుడు దేవుడు ఒక్కడే అని, మీరు దేవునికి మాత్రమే విధేయులై ఉంటారనీ దేవుని గ్రంథం మూలంగా మరియు ఆయన ప్రవక్త ద్వారా తెలిసినదే మీరు సత్యంగా భావిస్తారని మీరు అంగీకరించారన్నమాట. అంటే ముస్లిమవగానే మీరు దేవుని సమక్షంలో తమ స్వాతంత్ర్యాన్ని త్యజించారన్నమాట. "ఇది నా అభిప్రాయం, ఇది లోక రీతి, ఇది వంశ సంప్రదాయం లేక ఫలానా హజ్రత్, ఫలానా మహనీయులిలా సెలవిచ్చారు" అని అనడానికి ఇక మీకు ఎలాంటి అధికారము లేదు. దైవాదేశమూ, ప్రవక్త సంప్రదాయాలకు భిన్నంగా వీటిలో ఏ విషయాన్నయినా మీరిక ఆచరించలేదు. ఇక మీ పని ఒక్కటే, ప్రతి విషయాన్నీ పవిత్ర ఖుర్ఆన్, సున్నత్‌ల సమక్షంలో సమర్పించండి. వాటి ప్రకారం ఉన్నదాన్ని స్వీకరించండి. వాటికి విముఖమైన దాన్ని, అది

ఎవరి మాటయినా, ఎవరి విధానమయినా దాన్ని విసిరివేయండి. తన్ను ముస్లిమని చెప్పుకోవడమూ తిరిగి ఖుర్ఆన్, సున్నత్‌ల సాదృశ్యంగా తన అభిప్రాయానికో, లోక రీతికో, ఎవరో ఒక వ్యక్తి ఆదేశానికో లేక ఆచరణకో ప్రాధాన్యత ఇవ్వడం రెండూ పరస్పరం విరుద్ధమయినవి. ఏ విధంగానయితే ఒక కబోది తన్ను కన్నులున్నవానిగానూ, చప్పిడి ముక్కుగల వ్యక్తి తనకూ ఒక ముక్కు ఉందని చెప్పుకోజాలరో అదే విధంగా జీవిత వ్యవహారాలన్నింటినీ ఖుర్ఆన్, సున్నత్‌ల అధీనం చేయడానికి నిరాకరించి తన బుద్ధినో, లోక రీతినో, వేరొక మానవుని ఆదేశాచరణాలనో దైవం, ఆయన ప్రవక్తకు అభిముఖంగా ప్రవేశపెట్టే వ్యక్తి కూడా తన్నుతాను ముస్లిమని చెప్పుకోలేడు.

ముస్లిమ్‌గా ఉండగోరని వ్యక్తిని ముస్లిమయి ఉండమని ఎవరూ బలాత్కరించరు. తాను కోరిన జీవిత విధానాన్ని ఆశ్రయించడానికీ, తన ఇచ్ఛవచ్చిన పేరు పెట్టుకోడానికీ అతనికి అధికారముంది. కాని తన్నుతాను ముస్లిమని చెప్పుకున్నప్పుడు తాను ఇస్లామ్ సరిహద్దుల్లో ఉన్నంతవరకే ముస్లిమ్ అయి ఉండగలడన్న విషయం అతను బాగా అర్థం చేసుకోవాలి. దైవ గ్రంథమూ, దైవ ప్రవక్త (స) సంప్రదాయాల్ని, సత్యం, సదాచారాల ప్రమాణాలని, ఆదర్శాలని స్వీకరించాలి. వాటికి భిన్నమయిన ప్రతిదాన్నీ మిథ్య అని భావించాలి. ఇదే ఇస్లామ్ సరిహద్దు. ఈ సరిహద్దుల్లో ఉన్న వ్యక్తే ముస్లిమ్. దీని వెలుపల అడుగు పెట్టగానే అతను ఇస్లామ్ నుంచి దూరమవుతాడు. ఆ తరువాత కూడా తన్నుతాను అతను ముస్లిమని భావించుకున్నా, ముస్లిమని చెప్పుకున్నా అది కేవలం ఆత్మవంచన, లోకవంచన కూడా!

**"ఎవరయితే అల్లాహ్ పంపిన ఆదేశాల ప్రకారం తీర్పు చేయరో వారే నిశ్చయంగా దైవ ధిక్కారులు (తిరస్కారులు)." (5 : 44)**

* * *

# కలిమయే తయ్యిబా – ఇస్లామ్ మూల సిద్ధాంతం

ముస్లిమ్ సోదరులారా!

ఇస్లామ్ పరిధిలో, ఒక వ్యక్తి, ఒక కలిమా (సద్వచనం) పఠించి ప్రవేశిస్తాడని మీకు తెలిసిన విషయమే. ఆ వచనం కూడా ఎంతో పెద్దది కాదు. కేవలం కొన్ని పదాలు.

"లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్."

ఈ పదాలు నోటితో ఉచ్చరించిన క్షణమే మనిషిలో ఎన్నెన్నో మార్పులు సంభవిస్తాయి. ముందు తిరస్కారిగా ఉన్న తను ఇప్పుడు ముస్లిమయ్యాడు. ముందు అపరిశుద్ధుడయినవాడు ఇప్పుడు పరిశుద్ధుడయ్యాడు. గతంలో దేవుని ఆగ్రహ పాత్రుడయినవాడు ఇప్పుడు అభిమానానికి అర్హుడయ్యాడు. ముందు నరకానికి పోవలసిన వ్యక్తికై ఇప్పుడు స్వర్గ ద్వారాలు తెరుచుకున్నాయి. విషయం ఇంతటితో సరిపోదు. ఈ కలిమా కారణంగా మనిషి మనిషిలోనూ ఎంతో మార్పు వచ్చేస్తుంది. ఈ కలిమాకు

సమ్మతించి పఠించేవారంతా ఒక ఉమ్మత్ (అనుచర సంఘం)గానూ, మరి దీన్ని తిరస్కరించేవారంతా మరో సంఘంగా రూపొందుతారు. తండ్రి ఒకవేళ కలిమా స్వీకరించే వాడున్నూ కొడుకు దీన్ని తిరస్కరించేవాడయితే తండ్రి ఇక తండ్రి కాడు. కొడుకు కూడా కొడుకు కాడు. తండ్రి ఆస్తిలో నుండి ఈ పుత్రునికి ఎలాంటి భాగమూ లభించదు. తల్లీ చెల్లెండ్రు సయితం ఇతన్ని చూస్తే గోషా చేస్తారు.* కలిమా పఠించే వ్యక్తి పరాయివాడైనా ఈ ఇంటి అమ్మాయిని పెళ్ళాడితే అతనూ అతని సంతానమూ ఈ ఇంటి సొత్తుకు వారసులవుతారు. కాని, తన సంతానమే అయిన కొడుకు కేవలం కలిమాను స్వీకరించకపోవడం చేత ఎన్నడూ ఎరుగనంతగా అన్యుడయిపోతాడు. అంటే ఈ కలిమా ఎంతటి అన్యులయినవారినైనా అన్యోన్యంగా కలిపి, బంధువులయిన వారిని కూడా పరస్పరం వేరుజేస్తుందన్న మాట – చివరికి, పితృ, మాతృ సంబంధమయిన బంధుత్వాలు సయితం దీని ముందు బహు అల్పమయిపోతాయి. అంతటి శక్తిమంతమయినది ఈ కలిమా

ఇంతటి బృహత్తర భేదం మనిషి మనిషిలో ఎలా సంభవిస్తుందో కాస్త గమనించండి. కలిమాలో ఏముంది? కొన్ని అక్షరాలు మాత్రమే కదా! ల, ఇ, హ, మ, ద, స, ఇలాంటివే మరికొన్ని అక్షరాలు. ఈ అక్షరాల మిశ్రమంజేసి నోటితో ఉచ్ఛరించగానే ఏదైనా మాయ జరుగుతుందా మనిషి స్థితిగతులే మారిపోవడానికి? ఇంతటి చిన్న విషయం వల్ల మనిషిమనిషిలో భూమ్యాకాశాల వ్యత్యాసం ఏర్పడగలదా?

---

★ తిరస్కారి కుమారునిలో తల్లీ, తిరస్కారి సహోదరునిలో చెల్లెలూ పర్దా చేయవలసిందిగా షరీఅత్ ఆజ్ఞ కాకపోయినా క్రియాత్మకంగా తమ విశ్వాసం పట్ల అభిమానం గల ముస్లిమ్ మహిళలు ఇలాంటి సహోదరుల, పుత్రుల ముఖాలు సయితం చూడటం సహించరు.

ప్రియ సోదరులారా! మీరే కాస్త మీ వివేకాన్ని ఉపయోగించి గమనించారంటే కేవలం నోరు తెరచి, నాలుక ఆడించి కొన్ని అక్షరాలు ఉచ్చరించడం వల్ల ఇంతటి ప్రభావం పడజాలదని మీ బుద్ధే మీకు బదులిస్తుంది. మంత్రానికి భావమేమిటో ఎవరికీ తెలియకపోయినా మంత్రం పఠించగానే కొండలు కంపిస్తాయనీ, భూమి బ్రద్దలవుతుందనీ, నీరు ఉప్పొంగివస్తుందనీ, విగ్రహారాధకులూ, బహు దైవారాధకులయితే తప్పక భావించగలరు. ఎందుకంటే ప్రభావం అంతా అక్షరాల్లోనే ఉందనీ ఇవి అలా నోటి నుంచి వెలువడగానే మాయద్వారాలు తెరుచుకుంటాయని వారి విశ్వాసం. కాని ఇస్లామ్‌లో అలా కాదు. అర్థానికే ఇక్కడ ప్రాధాన్యత, శబ్దాల ప్రభావం అర్థానికి లోబడివుంది. అర్థమే లేకపోతే, అది హృదయాంతర్యాల్లో నాటుకోకపోతే మాటల శక్తి వల్ల మీ భావాల స్వభావాలూ, ప్రవర్తన ఆచరణలు మారకపోతే కేవలం కొన్ని పదాలు ఉచ్చరించినంత మాత్రాన ఎలాంటి ప్రభావమూ పడజాలదు.

ఈ విషయాన్ని ఒక సాధారణ ఉదాహరణ ద్వారా వివరిస్తాను. మీకు చలివేస్తుందనుకోండి నోటితో మీరు "దూదీ పరుపూ" "దూదీ పరుపూ" అంటూ కేకలు వేయడం మొదలెడితే మీ చలి బాధ తగ్గదు. రాత్రంతా ఒక లక్షసార్లు "దూదీ పరుపూ" అని వల్లించినా అంతే! కాని పరుపులో దూది నింపి దాన్ని ఉపయోగించారంటే చలివేయడం తగ్గుతుంది! మీకు దాహం అవుతుందనుకోండి, అప్పుడు ప్రొద్దస్తమానం "నీళ్ళూ నీళ్ళూ" అని కేకలు వేసుకుంటూ ఉంటే దాహం తీరదు. కాని ఒక్క నీటిగ్రుక్క త్రాగారంటే లోని మంట వెంటనే చల్లారుతుంది. మీకు జలుబూ జ్వరం వచ్చిందనుకోండి, ఈ స్థితిలో "కషాయం, కషాయం" అంటూ జపం చేశారంటే మీ జలుబు జ్వరంలో ఏ మాత్రం తగ్గుదల కాజాలదు. కషాయం తయారు చేసి త్రాగారంటే జలుబూ జ్వరం తామై పారిపోతాయి! కలిమయే తయ్యిబా (శిష్టవచనం)

విషయంలోనూ ఇంతే. తిరస్కారిగా ఉన్న మనిషి ముస్లిమ్‌గానూ, అశుద్ధమైనవాడు పరిశుద్ధుడుగానూ, దైవాగ్రహపాత్రుడు - దైవ ప్రేమపాత్రుడుగానూ నరక పాత్రుడు స్వర్గ పాత్రుడుగానూ మారిపోయేంతటి గొప్ప వ్యత్యాసం కేవలం ఈ ఆరు ఏడు పదాలు పలుకగానే సంభవించజాలదు. ఈ వ్యత్యాసం ఎలా సంభవిస్తుందంటే, ముందు ఈ పదాల భావం తెలుసుకోవాలి. ఆ భావం మీ హృదయాల్లో నాటుకున్నప్పుడు భావం ఎరిగి మీరాపదాలను నోటితో ఉచ్చరించారంటే మీ దేవుని ఎదుట, సమస్త లోకం ఎదుట ఎంత గొప్ప ప్రమాణ స్వీకారం చేస్తున్నారో, ఈ ప్రమాణ కారణంగా ఎంత గొప్ప బాధ్యత మీపై తారసిల్లుతుందో పరిపూర్ణ జ్ఞానం కలుగుతుంది. దీన్ని అర్థం చేసుకుంటూ మీరు ప్రమాణం చేస్తే ఆ తరువాత మీ భావనలపై, ఊహలపై, పూర్తి జీవితంపై ఈ కలిమా ఆధిపత్యమే ఉండాలి; దాని మీదట మీ మనోమస్తిష్కాల్లో ఈ కలిమాకు భిన్నమయిన ఏ విషయానికయినా మీరు చోటివ్వకూడదు. ఈ కలిమా మాత్రం సత్యమైనదనీ, మీరు చిరకాలానికి ఒకే పరిపూర్ణ నిర్ణయం తీసుకోవాలి. మీ జీవితంలోని కార్యకలాపాలన్నిటిలో ఈ కలిమా మాత్రమే సర్వాధికారిగా ఉండాలి. ఈ కలిమా స్వీకారానికి అనంతరం ఇష్టమయినదంతా చేయడానికి మీరు తిరస్కారుల వలె స్వేచ్ఛా విహారులుకాక ఈ కలిమాకు బద్ధులయ్యారు. ఇది చేయమన్నదాన్నే చేయాలి. ఇది నిషేధించినదాన్ని త్యజించాలి. ఇదీ కలిమా పఠించడమంటే! ఈ విధంగా కలిమా పఠించినప్పుడు మనిషి ముస్లిమ్ అవుతాడు. ఇంకా ఇలా పఠించి దాన్ని స్వీకరించినప్పుడే మనిషి మనిషిలో వేనింతకు ముందు ప్రస్తావించిన గొప్ప వ్యత్యాసం ఏర్పడగలదు.

ఇక కలిమా భావమేమిటో, దాన్ని పఠించి మనిషి దేన్ని స్వీకరిస్తాడో, మరి దీన్ని స్వీకరించగానే దేనికి బద్ధుడై పోతాడో వివరిస్తాను వినండి.

కలిమా భావమేమంటే: "అల్లాహ్ తప్ప వేరే ఏ ఇతర దేవుడూ లేడు, హజ్రత్ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) అల్లాహ్ ప్రవక్త." కలిమాలో "ఇలాహ్" అనే పదముంది. దానికి దేవుడని అర్థం; దేవుడంటే - యజమాని, అధికారి, శాసనకర్త, సృష్టికర్త, పాలనా పోషణా జేసేవాడు, ప్రార్థనలను ఆలకించి వాటిని ఆమోదించేవాడు, ఆరాధనకు అర్హుడైన వాడు అని అర్థం. ఇక 'లా ఇలాహ ఇల్లల్లాహ్' అన్నదానికి భావమేమంటే, ఈ ప్రపంచం దైవం లేకుండా సృష్టిలోనికి రాలేదు, మరి దీనికి అనేక దైవాలు కూడా లేవు. వాస్తవానికి దేవుడున్నాడు, ఆ దేవుడు ఒక్కడే. ఆ ఏకైక దైవం తప్ప వేరుగా మరి దేనికీ దైవత్వం లేదు అనే మొదటి విషయాన్ని మీరంగీకరించారు. కలిమా పఠించి మీరంగీకరించిన రెండో విషయం ఏమంటే; ఆ ఏకైక దేవుడే మీకూ సర్వ జగత్తుకూ ప్రభువు; మీరూ మీ సర్వస్వం ఇంకా ప్రపంచంలోని యావత్తు సామగ్రి ఆయనదే; సృష్టికర్త ఆయనే, దాత ఆయనే, జనన మరణాలు జరుగుతాయి ఆయన ద్వారా; మరి ఆయన ద్వారానే కష్టసుఖాలున్నూ కలుగుతాయి; ఎవరికి ఏది ప్రాప్తమైనా వాస్తవంగా దాని దాత ఆయనే, ఎవరు ఏది కోల్పోయినా వాస్తవంగా దాన్ని తీసుకునేది సయితము ఆయనే; భీతి చెందవలసినది ఆయనకే; అర్థించవలసినది ఆయననే; తల ఒగ్గవలసినది ఆయన ముందే, ఆరాధనాదాస్యాలు చెల్లించాలంటే ఆయనకే. ఆయినకు తప్ప మనం వేరొకరికి బానిసలమూ, సేవకులమూ కాము; ఆయన తప్ప మనకు వేరొక ప్రభువూ అధికారీ లేడు; ఆయన ఆజ్ఞల్ని పాలించడమూ, ఆయన శాసనాల్ని అనుసరించడమే మన నిజ విధి.

"లా ఇలాహ ఇల్లల్లాహ్" పఠించగానే తమ దేవునితో మీరు చేసే ప్రతిజ్ఞా ప్రమాణాలివి. అదీ సర్వలోక సాక్ష్యంగా చేస్తారు. దీనికి విరుద్ధంగా ఆచరించారంటే

మీ నోరూ, కాళ్ళూ, చేతులూ, మీ రోమరోమమే కాదు, భూమ్యాకాశాల అణువణువూ – దేని దేని సమక్షంలో మీరు మిథ్యా ప్రమాణం చేశారో అవన్నీ దైవ న్యాయ స్థానంలో మీకు ప్రతికూలంగా సాక్ష్యమిస్తాయి. మిమ్మల్ని నిరపరాధిగా నిరూపించేందుకు ఒక్క సాక్షి కూడా లభించడు. మీరు కడు నిస్సహాయ స్థితిలో అక్కడ నిలబడవలసి ఉంటుంది. మీ తరఫున వాదించడానికి ఏ వకీలూ బారిష్టరుగారూ దొరకరు. ప్రపంచ న్యాయస్థానాల్లో తారుమారుజేస్తూ సంచరించే ఈ వకీలూ బారిష్టరుగార్లున్నూ అక్కడ మీ వలెనే దీనస్థితిలో నిలుచుండి ఉంటారు. అబద్ధపు సాక్ష్యాలూ, కృత్రిమ దస్తావీజులు సమర్పించి తప్పుడు వాదం ద్వారా తప్పించుకోడానికి ఆ న్యాయస్థానం ఏ మాత్రమూ చోటివ్వదు. ప్రపంచ పోలీసుల నుంచి తమ అపరాధాన్ని దాచగలిగినట్లు దేవుని పోలీసుల నుంచి అలా చేయజాలరు. ప్రపంచంలోని పోలీసు లంచం పుచ్చుకోగలడు. కాని దేవుని పోలీసు లంచం తినడు. ప్రపంచంలోని సాక్షులు, అబద్ధమాడగలరు. కాని దేవుని సాక్షులకు సత్యం పలకడం తప్ప వేరేది తెలియదు. ప్రపంచంలోని అధికారులు అన్యాయం చేయగలరు, కాని దేవుడు అన్యాయం చేసే అధికారి కాడు. దేవుడు బంధించే చెరసాల నుంచి తప్పించుకుని పారిపోయే మార్గం ఏదీ లేదు. ఇలాంటి పరిస్థితిలో దేవునితో మిథ్యా ప్రమాణం చేయడం అత్యంత అవివేకం, అతి ఘోరమయిన అవివేకం. ప్రమాణం చేసేటప్పుడే బాగా ఆలోచించి మరీ చేయండి. దాన్ని పరిపూర్ణంగా నెరవేర్చండి. ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ప్రమాణం చేయవలసిందే అని మీపై ఎలాంటి బలవంతమూ లేదు. ఎందుకంటే ఇలా పొట్టి నోటి ప్రమాణాన్ని చేయడం కేవలం వ్యర్థం.

'లా ఇలాహ ఇల్లల్లాహ్,' అన్న తరువాత మీరు 'ముహమ్మ దుర్ర సూలుల్లాహ్' అని అంటారు. దీనికి అర్థమేమంటే, ఎవరి ద్వారా దేవుడు తన శాసనాన్ని పంపాడో, ఆ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం) అని

అంగీకరించారన్న మాట. దేవుణ్ణి తమ ప్రభువూ పాలకుడుగా స్వీకరించిన పిదప ఆ ప్రభువు ఆజ్ఞలేవో తెలుసుకోవడం అవసరం. ఆయన ప్రసన్నుడయ్యేందుకు ఏ కార్యాలు మనం చేయాలి? మరి ఆ ప్రసన్నుడయ్యే ఏ కార్యాలు మనం చేయకూడదు? మనం ఏ శాసనాన్నయితే అనుసరిస్తే రక్షిస్తాడో, అధిగమిస్తే శిక్షిస్తాడో ఆ శాసనం ఏది? ఈ విషయాలు తెలుపటానికి దేవుడు హ|జత్ ముహమ్మద్(సఅసం)ను తన రాయబారిగా నియమించాడు. వారి ద్వారా తన గ్రంథం మన వద్దకు పంపాడు. వారు దైవాదేశాల ప్రకారం జీవితం గడిపి, ఒక ముస్లిమ్ తన జీవితం ఎలా గడపాలో చూపి వెళ్ళారు కనుక మీరు "ముహమ్మదుర్రసూలుల్లాహ్" అన్నప్పుడు మహాప్రవక్త (సఅసం) చూపెట్టిన శాసనమూ విధానాలను అనుసరిస్తామనీ, దానికి విరుద్ధమయిన శాసనాలపై తమ నిరసననూ, విహ్యాభావాన్ని ప్రకటిస్తామనీ, వాస్తవానికి మీరు ప్రమాణస్వీకారం చేసుకున్నారన్న మాట. ఈ స్వీకారానికి అనంతరం ఒకవేళ మీరు మహాప్రవక్త(సఅసం)తెచ్చిన శాసనాన్ని తిరస్కరించి ప్రపంచపు చట్టాలను అంగీకరిస్తూ ఉన్నారంటే మీ కంటే మిథ్యావాది, నమ్మకద్రోహి వేరొకడు లేడన్నమాట. ఎందుకంటే ముహమ్మద్ (సఅసం) తెచ్చిన చట్టమే ధర్మమయినదనీ, మరిదాన్నే అనుసరిస్తామనీ ప్రమాణం చేసే కదా మీరు ఇస్లామ్‌లో ప్రవేశించారు. ఈ అంగీకార ఫలితంగానే కదా మీరు ముస్లిమ్‌ల సహోదరులయ్యారు, దీని పుణ్యమా అంటూ తమ పిత్రార్జితం పొందడానికి అర్హులయ్యారు, దీని ఫలితంగానే ఒక ముస్లిమ్ మహిళతో మీ వివాహమూ అయినది. దీని ఫలితంగానే మీ సంతానం ధర్మ సంతానమయింది. ముస్లిములందరూ మీకు సహాయపడటానికి జకాత్ * ఇచ్చేందుకూ, మీ

---

★ *జకాత్ : నియమిత సంపత్తి కంటే అధికంగా ఉన్నప్పుడు ప్రతి ముస్లిమ్ చెల్లించవలసిన నిర్ణీత ధనం.*

ధన, మాన, ప్రాణాల రక్షణ భారం వహించేందుకూ మీకు అర్హత లభించింది ఈ స్వీకారం కారణంగానే కదా? ఇవన్నీ పొంది ప్రమాణ భంగం చేశారంటే ఇంతకన్నా విశ్వాసఘాతుకం లోకంలో వేరొకటి ఏముంది?

మీరు "లా ఇలాహ ఇల్లల్లాహ ముహమ్మదుర్రసూలుల్లాహ" అనే వచనం అర్థాన్ని గ్రహించి మనస్ఫూర్తిగా దీన్ని అంగీకరించినవారే అయితే దైవాజ్ఞపాలనకై మిమ్మల్ని నిర్బంధించే ఏ పోలీసు, ఏ న్యాయస్థానమూ, ఈ లోకంలో మీకు కనబడకపోయినా సర్వావస్థల్లో మీరు దైవాజ్ఞల్ని పాలించవలసిందే. దేవుని పోలీసు, సైనికులు, న్యాయస్థానం, కారాగారం ఎక్కడా కానరావు కాబట్టి, ఆయన శాసనాన్ని ఉల్లఘించడం కడు సులువనీ, గవర్నమెంటు పోలీసు, సేన, న్యాయస్థానం, కారాగారం కళ్ళకు కనబడటం వల్ల దాని శాసనాన్ని ఉల్లంఘించడం దుస్సాధ్యమని భావించే వ్యక్తి "లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ" అని మిథ్యా ప్రమాణం చేశాడనీ, నిస్సంకోచంగా చెప్పవచ్చు. దైవాన్నీ, సర్వలోకాన్నీ ముస్లిములందరినీ స్వయంగా తన ఆత్మనూ వంచించాడతను!

సహోదరులారా! ఇప్పుడే మీ ముందు కలిమయేతయ్యిబా అర్థాన్ని వివరించాను. ఈ సందర్భంలో మరొక విషయం వైపు మీ దృష్టిని మళ్ళించగోరతాను.

దేవుడు మీకూ, లోకంలోని సమస్తానికీ ప్రభువని మీరంగీకరిస్తారు కదా! దీని భావమేమి? మీ ప్రాణం మీది కాదు, దేవుని సొత్తు. మీ చేతులు మీ సొంతం కావు. మీ చెవులు, మీ కన్నులు మరి మీ దేహంలోని ఏ ఒక్క అవయవమూ మీ సొంతం కాదు. మీరు దున్నే ఈ భూములు, మీరు సేవ చేయించుకునే ఈ పశువులు, మీరు వినియోగించుకునే ఈ వస్తు సామగ్రి వీటిలో ఏదీ మీకు చెందదు. అంతా దేవుని సొత్తే. ఇవన్నీ దేవుని చేత

బహూకరణ రూపంలో మీకు లభించాయని మీ అంగీకారానికి భావం. ఇలా అంగీకార ప్రమాణం చేశాక "నా ప్రాణం, నా శరీరం, నా ధనం, మరి అవి నావీ, ఇవి నావీ" అని అనడానికి మీకు అధికారమెక్కడిది? ఒకరిని యజమానని ఒప్పుకోవడమూ ఆ తరువాత ఆయన వస్తువును తనదిగా నిర్ణయించడం అర్థంలేని వ్యర్థమయిన మాట. ఈ సర్వానికీ ప్రభువు అల్లాహ్ అని వాస్తవంగా మీరు మనసారా అంగీకరించారంటే రెండు విషయాలు వాటంతట అవే తప్పనిసరి అవుతాయి. ఒకటి యజమాని దేవుడే అయితే, తన సొత్తును అమానతు (ట్రస్టు) రూపంలోనే ఆయన మీకు అప్పగించివుంటే, యజమాని సూచించే పద్ధతిలోనే ఆ వస్తువుల్ని వినియోగించాలి మీరు. ఆయన అభీష్టానికి విరుద్ధంగా వీటిని వినియోగిస్తే మోసం చేసినవారవుతారన్న మాట. మీ కాళ్ళు చేతులను సయితం ఆయన ఇచ్ఛా విరుద్ధంగా కదిలించే అధికారం లేదు మీకు. ఆయన అంగీకారానికి ప్రతికూలంగా ఈ కళ్ళను వినియోగించజాలరు మీరు. ఆయన ఆమోదం లేని ఏ పదార్థాన్నీ ఈ కడుపులో వేసే అధికారం మీకు లేదు. యజమాని ఇచ్ఛకు భిన్నంగా ఈ భూములపై, ఆస్తులపై కూడా మీకు ఎలాంటి అధికారం లేదు. మీ భార్యాబిడ్డలుగా చెలామణి అయ్యేవారూ ప్రభువు చేత ప్రసాదింపబడిన కారణానే మీవారయ్యారు. కనుక వీరితోనూ మీ ఇచ్ఛానుసారంగాకాక ప్రభువు ఆజ్ఞానుగుణంగానే ప్రవర్తించాలి. దీనికి భిన్నంగా ఆచరించారా మీరు నమ్మక ద్రోహులవుతారు. ఇతరుల భూమిపై దురాక్రమణ చేసుకునేవాణ్ణి మీరు ఏ విధంగా విశ్వాసఘాతకులని అంటారో, అచ్చం అలాగే దైవం ప్రసాదించిన వస్తువుల్ని తమ సొంతంగా భావించి తమఇచ్ఛానుసారంగా వినియోగించుకున్నా లేక దైవం తప్ప మరొకరి ఇష్టానుసారంగా వాటిని ఉపయోగించినా అదే నమ్మకద్రోహనేరం మీపై కూడా మోపబడుతుంది. యజమాని ఇష్టానుసారంగా ఆచరించడంలో ఏదైనా కష్టం కలిగితే కలగనివ్వండి,

కాళ్ళూ చేతులూ విరుగుతాయంటే విరగనివ్వండి. సంతాన నష్టం కలుగుతుందంటే కలగనివ్వండి. ఆస్తిపాస్తులు నాశనమవుతాయంటే కానివ్వండి. మీకెందుకు చింత? సొత్తు ఎవరిదో ఆయనే నష్టాన్ని అభిలషించాడంటే, అలా చేసే హక్కు ఆయనకు దానిపై ఉంది. కాని యజమాని ఆమోదానికి భిన్నంగా మీరు ప్రవర్తించి అందులో ఏదయినా నష్టం కలిగితే నిస్సందేహంగా మీరు అపరాధులే! ఎందుకంటే ఇతరుని సొత్తును ఆయన ఇచ్ఛకు విరుద్ధంగా మీరు చెరపడం చేత, స్వయంగా మీ ప్రాణాలపై సయితమూ మీకు అధికారం లేదు. ప్రభువు ఇష్టానుసారంగా ప్రాణాలర్పించారంటే యజమాని పట్ల తమ విధిని నిర్వర్తించారన్న మాట. దానికి వ్యతిరేకంగా ఆచరిస్తూ ప్రాణం కోల్పోయారంటే ఇదే చర్య నమ్మక ద్రోహమన్న మాట!

రెండవ విషయమేమంటే, యజమాని ప్రసాదించిన వస్తువును యజమాని ఆజ్ఞానుసారంగా ఉపయోగించడంలో మీరు ఎవరికీ చేసిన ఉపకారమేదీ లేదు, అటు యజమానికీ కాదు, ఇంకా మరెవరికీన్నీ కాదు, ఆయన మార్గంలో మీరేదైనా దానం చేసినా, సేవజేసినా లేక అన్నిటికన్నా ముఖ్యమయిన మీ ప్రాణాన్ని సమర్పించినప్పటికీ ఎవరికీ మీరు చేసిన ఉపకారమేదీ లేదు. మహా అంటే యజమాని ఎడల తమ బాధ్యతను నెర వేర్చారు. ఇంతే కదా, మీరు చేసిన ఘనకార్యం! ఉబ్బి గర్వించేందుకూ, పొగడ్తల కొరకు తాపత్రయపడేందుకూ, మీ కీర్తి జనసమ్మతాన్ని చూరగొనగలిగే ఘనకార్యం చేసినట్టు మీరు భావించడానికి ఇది ఎంత మహత్కార్యమనీ? ఒక్క మాట మాత్రం జ్ఞాపకముంచుకోండి. ప్రభు మార్గాన ఏదైనా ఖర్చు చేసి లేదా ఏదయినా సేవ చేసి నిజమైన ముస్లిమ్ పొంగిపోడు. ఇంకనూ నమ్రతా వినయాలను ఆచరిస్తాడు. గర్వించడం సత్కార్యాన్ని నాశనం చేసి వేస్తుంది. పొగడ్తలను కోరి వాటి కోసమే ఏదయినా సత్కార్యం చేసే వ్యక్తి దేవుని సన్నిధిలో ఎలాంటి ప్రతిఫలానికీ అర్హుడు కాడు. ఎందుకంటే తన

కార్యానికి ప్రతిఫలం అతను ప్రపంచంలోనే కోరాడు. అది ఇక్కడే అతనికి లభించింది కూడాను!

సహోదరులారా! మీ యజమాని చేసిన ఉపకారాన్ని కాస్త చూడండి. తాను ప్రసాదించిన వస్తువునే మీ వద్ద నుంచి తీసుకుని, "ఈ వస్తువును నేను మీ వద్ద నుండి కొన్నాను, దీనికి ప్రతిమూల్యం మీకు నేనిస్తాను" అని అంటాడు! ఎంత గొప్ప వాడు దేవుడు! అల్లాహు అక్బర్! ఈ మహోన్నత, కరుణానుగ్రహానికి పరిమితి ఏమయినా ఉందా! ఖుర్ఆన్‌లో ఈ విధంగా చెప్పబడుతుంది:

> "స్వర్గాన్ని ప్రతిమూల్యంగా (ప్రసాదించి) అల్లాహ్ విశ్వాసుల వద్ద నుండి వారి ప్రాణాలనూ, వారి ధన సామగ్రినీ కొన్నాడు."

ఇదీ మీ ప్రభువు మీతో అవలంబించే వైఖరి! ఇక మీ వైఖరిని కాస్త గమనించుకోండి. ప్రభువు మీకు ఒక వస్తువును అప్పగించి, తిరిగి దాని ప్రతిమూల్యమిచ్చి కొన్నాడు. దాన్ని మీరు తిరిగి పరులకు విక్రయిస్తున్నారు. అదిన్నీ అత్యంత అల్పమయిన ధరకు! ఆ కొన్నవారు ప్రభువేచ్ఛకు వ్యతిరేకంగా మిమ్మల్ని వినియోగించుకుంటున్నారు. వారే దాతలయినట్లు మీరున్నూ వారి సేవ చేస్తుంటారు. తమ బుద్ధిని వారికి విక్రయిస్తారు, మీరు తమ కాళ్ళూ చేతుల్ని విక్రయిస్తారు, శరీర శక్తుల్ని విక్రయిస్తారు, దైవద్రోహులు కొనదలచుకున్నదంతా విక్రయిస్తారు. ఇంతకన్నా అవినీతి ఏముంది? అమ్మివేసిన వస్తువును తిరిగి ఇతరులకు అమ్మడం శాసనానుసారంగానూ, నైతికంగానూ నేరమే! ప్రపంచంలోనే దీనిపై దగా, వంచనా నేరాల అభియోగం వేయబడుతుందే - అల్లాహ్ న్యాయస్థానంలో దీనిపై విచారణ జరగదనుకున్నారా?

★★★

# శిష్టవచనమూ, దుష్టవచనమూ

సహోదరులారా! గత ప్రసంగంలో కలిమయే తయ్యిబా (శిష్ట వచనం) గురించి కొంతవరకు మీ ముందు వివరించాను. తిరిగి నేడు అదే కలిమా గురించి ఇంకను కాస్త విశదంగా వివరిస్తాను. ఎందుకంటే, ఈ వచనమే ఇస్లామ్ మూలాధారము. దీని ద్వారానే ఒక వ్యక్తి ఇస్లామ్‌లో ప్రవేశిస్తాడు. ఈ వచనాన్ని పూర్తిగా అర్థం చేసుకుని దీని ప్రకారం తన జీవితాన్ని నిర్మించుకోనంతవరకు ఏ వ్యక్తీ వాస్తవంగా ముస్లిమ్ కాజాలడు.

ఈ వచనం గురించి అల్లాహ్ తన దివ్య గ్రంథంలో ఇలా పేర్కొని ఉన్నాడు.

"కలిమయే తయ్యిబా (శిష్ట వచనం)కు ఉదాహరణ ఎలాంటిదంటే, ఒక మంచి జాతికి చెందిన వృక్షముంది. దాని వేర్లు భూమిలో లోతుగా నాటుకుపోయాయి. దాని శాఖలు గగనంలో విస్తరించాయి. అది తన పోషకుని ఆజ్ఞానుసారంగా ప్రతి నిత్యం ఫలోత్పత్తిగావిస్తూ ఉంటుంది. దీనికి భిన్నంగా కలిమయే ఖబీసా (దుష్ట వచనం, మిథ్యా విశ్వాసం)కు ఉదాహరణ, నీచ జాతికి చెందిన స్వజాతమయిన

మొక్క లాంటిది. అది భూమి ఉపరితలంలోనే ఉంటుంది. ఒక్క కదలికలోనే తన మూల స్థానాన్ని వదలిపెట్టేస్తుంది. దాని వేర్లకు భూమిలో స్థిరత్వం, నిలకడ ప్రాప్తం కాదు."

దేవుడిచ్చిన అద్వితీయ ఉదాహరణ ఇది. సావధానంగా ఆలోచిస్తే గొప్ప గుణపాఠం కలుగుతుంది. పేర్కొన్న రెండు రకాల చెట్ల ఉదాహరణలు కూడా మీ ముందు ఎన్నో ఉన్నాయి. ఒక్క మామిడి చెట్టునే తీసుకోండి. గమనించండి. ఎంత స్థిరంగా నాటుకుని ఉందో, ఎంత ఎత్తుగా హుందాగా నిలబడి ఉందో, కొమ్మలు ఎలా క్రమ్ముకున్నాయో, ఎంత కమ్మని పండ్ల నిస్తుందో, దీని విత్తనం శక్తిమంతమైనదవడం దానికి వృక్షమయ్యే హక్కుండటం మూలానే ఈ స్థానం ప్రాప్తమయింది! ఆ 'హక్కు' ఎంత నిజమైందంటే - అది తన హక్కును ప్రకటిస్తే భూమి, నీరు, వాయువు, పగటి ఉష్ణమూ, రాత్రుల శీతలం అన్నీ ఆ హక్కును అంగీకరించాయి, అది ఏదడిగితే అదే ఇచ్చివేశాయి. ఈ విధంగా అది దాని నిజమయిన హక్కు బలం చేత ఇంత గొప్ప వృక్షమైపోయింది. మధుర ఫలాలిచ్చి వాస్తవంగా అది ఇలాంటి మహా వృక్షమయేందుకే తగిందని నిరూపించుకున్నది. భూమ్యాకాశాల సర్వ శక్తులు కలిసి దానికి సహాయం చేశాయంటే అది అనుచితమేమీ కాదు. అలా చేయడమే వాటి ధర్మం. ఎందుకంటే వృక్షాలకు ఆహారం సరఫరా చేసి, పెంచి ఫలాలకు పక్వం చేకూర్చే శక్తి ఏదయితే భూమి, నీరూ, గాలి, ఇంకా ఇతర వస్తువుల్లో ఉందో అది ఉత్తమ జాతి వృక్షాలకు ఉపయోగపడేందుకే!

దీనికి భిన్నంగా వాతావరణానుగుణంగా పుట్టుగరిక ముండ్ల పొదలను గమనించండి. వాటి శక్తిసామర్థ్యాల విలువెంత? ఇసుమంతైన వేరు, చంటి పిల్లవాడూ పీకివేయగలడు! గాలి ఒక్కసారి జోరుగా వీచిందంటే కూలిపోయేంతటి బలహీనమైనవి. చేతితో స్పర్శించారంటే ముండ్లతో

సత్కరిస్తాయి. రుచి చూచారంటే నోరే చెడిపోతుంది. ప్రతి దినం ఎన్ని ఉద్భవిస్తాయో, ఎన్ని పీకివేయబడతాయో దేవుడే ఎరుగు. వీటి గతి ఇలా ఎందుకు అయింది? మామిడిలోని నిజమయిన 'హక్కుకు' ఉన్న శక్తి వీటిలో లేదు. ఉత్తమ జాతి వృక్షాలు లేకపోతే భూమి బీడుపడి ఉండటం సహించలేక ఈ పొదలకు చోటిస్తుంది. నీరు కాస్త సహాయపడుతుంది. గాలి తన సామగ్రితో కొంతవరకు సహకరిస్తుంది. కాని భూమ్యాకాశాలందు ఏదీ వాస్తవంగా ఈ పొదలకు జీవించే అధికారముందనీ అంగీకరించడానికి సిద్ధంగా ఉండదు. అందువల్ల భూమి వీటి వేర్లు విస్తరింపనివ్వదు; నీరు మనస్ఫూర్తిగా ఆహారం సరఫరా జేయదు; గాలి మనసారా వీటిని పెంపొందించదు. ఇంతటి శక్తిసామర్థ్యాలతో ఈ దుష్ట పొదలు రుచిలేనివిగా, ముండ్లతో నిండినవిగా, విషపూరితాలుగా తయారైనప్పుడు భూమ్యాకాశాల శక్తులన్నీ ఇలాంటి పొదలను ఉత్పత్తి జేయడానికి గాను వినియోగించబడలేదనీ, వాస్తవంగా ఈ కాస్త అల్ప జీవితం వీటికి లభించడమే గొప్పదని నిర్ధారణ అవుతుంది.

ఈ రెండు ఉదాహరణల్ని దృష్టిలో ఉంచుకుని శిష్టవచనం, దుష్టవచనాల వ్యత్యాసాన్ని పరిశీలించండి. కలిమయే తయ్యిబా ఏమిటి? ఒక సత్యవాక్కు. మహా గొప్ప సత్యవచనం ఇది. దీనికంటే సత్యమయిన మాట వేరొకటి కాజాలదీ ప్రపంచంలో! "విశ్వానంతటికీ దైవం అల్లాహ్ ఒక్కడే!" అన్న విషయాన్ని భూమ్యాకాశాల సర్వస్వమూ రూఢి పరుస్తుంది. ఈ మానవుడు, జంతువులు, వృక్షాలు, పర్వతాలు, ఇసుక రేణువులు, ప్రవహించే జలవాహినులు, ప్రజ్వలించే సూర్యుడు, చంద్రుడు సర్వవ్యాప్తమయిన వీటంతటిలో - అల్లాహ్ కాక మరొకరు పుట్టించింది ఏది? అల్లాహ్ కాక మరొకరి దయతో జీవిస్తూ స్థిరంగా ఉండగలిగేదేదీ, అల్లాహ్ కాక మరొకరి చేత నాశనం కాగిలిగేది ఏదీ? కనుక ఈ విశ్వమంతా అల్లాహ్ చేత సృష్టింపబడి, ఆయన అనుగ్రహం

వల్ల సుస్థిరంగా ఉంది. ఆయన మాత్రమే దీనికి ప్రభువూ యజమాని అయిన కారణాన "విశ్వంలో అల్లాహ్ తప్ప మరెవరి దైవత్వమూ లేదు" అని మీరన్నప్పుడు భూమ్యాకాశాలలో ఉండే సర్వమూ "నీవన్నది పరమ సత్యం, నీ ఈ వాక్కులోని సత్యానికి మేమంతా సాక్షులము" అంటూ ఎలుగెత్తి చాటుతాయి. మీరాయనకు తల ఒగ్గారంటే సృష్టి సర్వమూ మిమ్మల్ని అనుకరిస్తుంది. ఎందుకంటే ఈ యావజ్జగత్తు ఆయన ఆరాధనా తత్పరత కలిగినదే! మీరాయన ఆజ్ఞాపాలన చేస్తే భూమ్యాకాశాల్లోని సర్వమూ మీతో సహకరిస్తుంది. ఎందుకంటే ఇవన్నీ ఆ ప్రభువుకు విధేయులయినవే; ఆయన మార్గాన అడుగువేసినప్పుడు మీరు ఒంటరిగా ఉండరు. విశ్వమహా సైన్యం మీ వెంట ఉంటుంది. ఎందుచేతనంటే నభాంతరాళాల్లోని ప్రభాకరుడు మొదలుకుని ధరణిలోని అధమ రేణువు వరకు ప్రతి వస్తువూ ఆయన మార్గాన్నే కదా అనుక్షణం సంచరిస్తుంది! ఆయనపై భారం మోపడమంటే ఏదో సాధారణ శక్తిని విశ్వసించినట్లుగాదు. భూమ్యాకాశాల సర్వభాగ్యాలకు ప్రభువైన మహోన్నత శక్తిమంతుని నమ్మడమన్నమాట. ఈ యదార్థాన్ని దృష్టిలో ఉంచుకుంటే, కలిమయేతయ్యిబాను విశ్వసించి కేవలం దాని ప్రకారమే తన జీవితాన్ని నిర్మించుకునే వ్యక్తితో భూమ్యాకాశాల సర్వ శక్తులు సహకరిస్తాయని మీరు తెలుసుకుంటారు. ఇహపరాలలో అతను వృద్ధీ వికాసాలు పొందుతూనే ఉంటాడు. ఏ ఒక్క క్షణానికీ నిరాశ వైఫల్యాలు అతని దరిచేరవు, దైవం సెలవిచ్చింది ఈ విషయాన్నే!

"ఈ కలిమా (వచనం) ఎలాంటి వృక్షమంటే దీని వేర్లు భూమిలో నాటుకుని ఉండగా, శాఖలు గగనాన విస్తరించి ఉన్నాయి. దైవాజ్ఞానుసారంగా ఇది ప్రతి నిత్యమూ ఫలిస్తూ ఉంటుంది."

దీనికి ప్రతికూలంగా కలిమయే ఖబీసా (దుష్టవచనం)ను గమనించండి.

దుష్ట వచనమంటే ఏమిటి? "ఈ లోకానికి దేవుడంటు ఎవడూ లేడు" అన్నది; లేదా "అల్లాహ్ ఒక్కడే కాదు, ఇతరులకూ దైవత్వం ఉంది" అన్నది. గమనించండి! ఇంతకంటే అసత్యమైనదీ, నిరాధారమైనది వేరొక మాట ఏదైనా ఉందా? భూమ్యాకాశాలలో ఏది దీన్ని బలపరుస్తుంది? నాస్తికుడు దేవుడు లేడంటాడు. భూమ్యాకాశాలలోని సర్వమూ "నీవన్నది అబద్ధం, నిన్నూ, మిమ్మల్ని దేవుడే సృష్టించాడు. దేవుని గూర్చి అసత్యం పలకడానికి నీవు ఉపయోగిస్తున్న ఈ నోరు నీకు ప్రసాదించినదీ ఆ దైవమే" అని అంటుంది. ముష్రిక్ (బహు దైవారాధకుడు) "దైవత్వంలో అల్లాహ్‌కు తోడుగా, దాతలూ, యజమానులూ, అదృష్టాల మంచీ చెడుల నిర్మాతలూ, లాభనష్టాలు కలిగించే శక్తి సంపన్నులూ, ప్రార్థనలను ఆలకించేవారూ, కోరికలను తీర్చేవారూ, భయపడడానికి, భారం మోపడానికి తగిన వారూ ఇతరులూ ఉన్నారనీ, ఈ విశ్వ రాజ్యంలో ఇతరుల ఆజ్ఞలు చలామణి అవుతాయనీ, దేవుడేకాక ఇతరుల ఆదేశాలూ, శాసనాలూ అనుసరయోగ్య మయినవే" అని అంటాడు. దీనికి సమాధానంగా ప్రపంచంలోని ప్రతి వస్తువు "నీవన్నది శుద్ధ అబద్ధం, నీవన్న ఒక్కొక్క మాట వాస్తవికతకు భిన్నమయింది" అంటుంది. ఇక గమనించండి. ఈ 'కలిమా'ను స్వీకరించి దీనిని అవలంబిస్తూ దీని ప్రకారమే జీవితం గడిపే వ్యక్తి ఇహపరాల్లో ఎలా వృద్ధివికాసాలు పొందగలడు? అల్లాహ్ ఇలాంటి వ్యక్తులకు గడువు ఇచ్చాడు. పోషణ వాగ్దానం చేశాడు. కాబట్టి భూమ్యాకాశాల శక్తులు ముళ్ళ పొదల్ని, గడ్డి మొక్కల్ని పోషిస్తున్నట్లే ఏదో ఒక విధంగా ఇతన్నీ పోషిస్తాయి. కాని విశ్వంలోని ఏదీ ఇతనితో సహకరించడం, ఇతని హక్కుగా భావిస్తూ సహకరించదు, ఇతనికి మనసారా సహాయపడదు. ఇంతకు ముందు మీ ఎదుట పేర్కొన్న ఉదాహరణలోని ముండ్ల పొదల పరిస్థితియే ఇతనికి వర్తిస్తుంది.

కలిమయే తయ్యిబా, కలిమయే ఖబీసా ఈ రెంటి ఫలితాల్లోనూ ఇదే వ్యత్యాసం. శిష్టవచనం ఫలించినప్పుడల్లా తీయని ప్రయోజనకరమైన ఫలాలే ఉత్పన్నమవుతాయి. ప్రపంచంలో దీనివల్ల శాంతి స్థాపితమవుతుంది. నీతి నిజాయితీ, సత్యం న్యాయాలు వర్ధిల్లుతాయి. సృష్టి సర్వమూ దీనివల్ల లాభాన్నే పొందుతుంది. కాని దుష్టవచనానికి ఎంతెంత పోషణ జరుగుతూ ఉంటుందో అంతగా అందులో నుంచి ముండ్ల రెమ్మలే అంకురిస్తాయి. చేదూ వెగటయిన ఫలాలే లభిస్తాయి. దీని అణువణువూ విషపూరితమై ఉంటుంది. ప్రపంచంలో కుఫ్ర్ (తిరస్కారం), షిర్క్ (బహు దైవవాదం), నాస్తికత్వం ప్రబలి ఉన్న చోట్లలో ఏమవుతుందో కళ్ళారా చూడండి. మనిషి మనిషిని చీల్చిచెండాడే ప్రయత్నాల్లో ఉన్నాడు. గ్రామాలూ, నగరాలను నాశనం చేసే సాధనాలు తయారవుతున్నాయి. విష వాయువులు తయారవుతున్నాయి. ప్రపంచాన్ని నరకంలా దహించివేసే ఆయుధాలు ఆవిష్కరించబడుతున్నాయి. ఒక జాతి మరొక జాతిని తుదముట్టించడానికి సిద్ధమవుతుంది. బలశాలి, బలహీనుల్ని కేవలం వారి వాటాకు చెందిన రొట్టె ముక్కను కాజేయడానికి తన బానిసలుగా చేసుకుంటున్నాడు. బలహీనులకు, సైన్యం, పోలీసు, జైలు, ఉరికంబాల దాడికి అణిగి, బలవంతుల దౌర్జన్యాన్ని సహించి ఉండటం కంటే గత్యంతరం లేదు. అయితే ఈ జాతుల ఆంతరంగిక పరిస్థితి ఎలా ఉందో గమనించారా? షైతాను సహితం సిగ్గుపడేలాంటి నీచాతినీచమైన ప్రవర్తన వీరిది. మృగాలు సహితం చేయని కార్యాలకు పాల్పడుతున్నాడు మానవుడు. తమ భోగ విలాసాలలో అంతరాయం కలిగిస్తారేమోనని తమ బిడ్డల్ని చేతులారా హతమార్చుకుంటున్నారు మాతృమూర్తులు. భార్యల పట్ల అత్యంత పౌరుషరహితులయ్యారు భర్తలు. లజ్జా మాన మర్యాదలను దరిచేరనివ్వని దిగంబర గృహాలు (Nude clubs) స్థాపితమవుతున్నాయి.

స్వార్థం సర్వ సామాన్యమైపోయింది. శ్రీమంతులు వడ్డీ రూపంలో బీదల రక్తాన్ని పీల్చేస్తున్నారు. అనాధలు తమ బానిసలయినట్లే, తమ సేవ కొరకు జన్మించినట్లే ధనమదాంధులు వారితో సేవ చేయించుకుంటున్నారు. ఈ విధంగా ఈ దుష్టవచనం ద్వారా ఎక్కడ ఏ మొక్క అంకురించినా అది ముండ్లతో నిండిందే, దానికి కాసిన కాయలన్నీ విషపూరితములే!

అల్లాహ్ ఈ రెండు దృష్టాంతాలను సూచించిన పిదప చివరిలో ఇలా సెలవిస్తున్నాడు:

"కలిమయే తయ్యిబాను విశ్వసించినవారిని ఇహపరాలలోనూ ఒక దృఢవచనంపై స్థిరతనూ, విలకడనూ ప్రసాదిస్తాడు దేవుడు. వీరికి భిన్నంగా కలిమయే 'ఖబీసా'ను విశ్వసించిన దౌర్భాగ్యుల శ్రమలన్నింటినీ, కృషినీ అల్లాహ్ వక్రమార్గాలకు మళ్ళిస్తాడు. ఇహపర లోకాల్లో సత్ఫలితాన్నిచ్చే సత్కార్యాన్ని ఇక వారెప్పుడూ చేయలేరు."

సహోదరులారా! శిష్టవచనం, దుష్టవచనాల వ్యత్యాసాన్ని మరి రెంటి పర్యవసానాన్ని మీరు విన్నారు. అయితే ఒక ప్రశ్న తప్పక జనిస్తుంది. "మనమయితే శిష్టవచనాన్ని విశ్వసించిన వాళ్ళమే కదా? మరి మనం వృద్ధివికాసాలు పొందడం లేదేం? దుష్ట వచనాన్ని విశ్వసించే తిరస్కారులే (అవిధేయులే) వృద్ధివికాసాలు పొందడానికి కారణమేమిటి?"

దీనికి సమాధానమివ్వడం నా భారం. నేనది ఇస్తాను. కాని ఒక్క షరతు, మీలో ఎవ్వరూ నా సమాధానంపై ఆగ్రహించుకోకూడదు. నా సమాధానం వాస్తవానికి సరయినదో కాదో మీ అంతర్యాన్నే అడగండి.

కలిమయే తయ్యిబాను విశ్వసిస్తున్నప్పటికీ మీరు వృద్ధి వికాసాలు పొందడంలేదని చెప్పడమే అసలు తప్పు. కలిమయే తయ్యిబాను విశ్వసించడం

అంటే నోటితో కలిమా పఠించడం కాదు. మనస్ఫూర్తిగా స్వీకరించడమనే దీని భావం. దీనికి భిన్నమైన మరో విశ్వాసమూ, దృక్పథమూ మీలో ఉండ కూడదు. మరి మీ చేతులారా దీనికి ప్రతికూలంగా ఏ కార్యమూ జరుగకూడదు. కలిమయే తయ్యిబాను విశ్వసించడమంటే ఈ విధంగా విశ్వసించడమనే దీని భావం. ప్రియ సోదరులారా! ధర్మంగా చెప్పండి. మీ తీరు వాస్తవంగా ఇలాగే ఉందా? కలిమయే తయ్యిబాకు పూర్తిగా భిన్నమైన "అనేక దైవారాధన" (షిర్క్)కు సంబంధించిన "తిరస్కారానికి" (కుఫ్రకు) సంబంధించిన భావాలూ, దృక్పథాలు వందలకొద్ది మీలో వ్యాపించిలేవా? ముస్లిమ్ శిరస్సు దైవం తప్ప ఇతరుల సమక్షంలో ఒగ్గడంలేదా? ముస్లిమ్ ఇతరులకు భీతిజెందడం లేదా? ఇతరుల సహాయంపై ఆధారపడటంలేదా? ఇతరులను దాతలని భావించటంలేదా? దైవ శాసనాన్ని కాదని ఇతరుల చట్టాల్ని కడు సంతోషంతో ఆచరించడం లేదా? తమ్ము తాము ముస్లిములని చెప్పుకునే వారిలో న్యాయ స్థానాలకు పోయి "మేము షరీఅత్★ను ఆమోదించము. సంప్రదాయాలూ, ఆచారాలనే అంగీకరిస్తాము" అని నిర్మొహమాటంగా చెప్పేవారు లేరా? ప్రాపంచిక లాభాలకై దైవశాసనాంగంలోని ఏదైనా ఒక అంశాన్ని ఉల్లంఘిం చేందుకు ఇసుమంతయినా జంకనివారు మీలో లేరా? తిరస్కారుల ఆగ్రహం ఎడల భయం కలిగి దేవుని భీతి అసలే లేనివారూ, తిరస్కారుల కంటిచలువ పొందడానికి ఏదైనా చేయడానికి తెగించేవారూ, కాని దైవ కటాక్షం కోసం ఏదీ చేయజాలనివారు మీలో లేరా? తిరస్కారుల ప్రభుత్వాన్నయితే ప్రభుత్వమని తలుస్తారు. కాని దేవుని ప్రభుత్వము ఒకటి ఉందనే తలంపు కూడా ఎప్పు డయినా రాదు. ధర్మంగా చెప్పండి. ఇది వాస్తవం కాదా? ఇది వాస్తవమైతే, కలిమయే తయ్యిబాను విశ్వసించినప్పటికీ మనం వృద్ధివికాసాలు

---

★ షరీఅత్ - ఇస్లామీయ శాసనాంగం.

పొందలేదని విలపించేందుకు నోరెలా వస్తుంది? ముందు మనస్ఫూర్తిగా విశ్వాసాన్నయితే గ్రహించండి. తమ జీవితాన్ని కలిమయే తయ్యిబా అనుసరణలో నిర్మించండి. ఆ తరువాత, భూగర్భంలో స్థిరపడి, గగనాన్ని ఆవరించుకునే వృక్షం మొలకెత్తకపోతే, ఒక తప్పుడు విషయాన్ని నమ్మించినందుకు తమ దేవుణ్ణి అసత్యవాదిగా భావించుకోండి. (అల్లాహ్ క్షమించుగాక!)

దుష్టవచనాన్ని విశ్వసించేవారు వాస్తవానికి ప్రపంచంలో వృద్ధివికాసాలు పొందుతున్నారని అనడం కూడా నిజం కాదు. దుష్టవచనాన్ని స్వీకరించిన వారు ఇంతకుముందు ఎన్నడూ వృద్ధి పొంది ఉండలేదు. మరి నేడూ వృద్ధివికాసాలు పొందడంలేదు! ధనవిస్తారం, సుఖభోగాల సరంజామా, బాహ్య అట్టహాసాలూ – ఆర్భాటాలూ చూచి వారు వృద్ధివికాసాలు పొందు తున్నారని భ్రమపడుతున్నారు మీరు. వారి అంతర్యాల్ని అడగండి – వారిలో ఎందరికి మానసిక తృప్తి లభ్యమైఉందో? వారి బాహ్యంలో భోగ భాగ్యాలు, ఆడంబరాలు నిండుకుని ఉన్నాయి. కాని అంతర్యాల్లో జ్వాలా ముఖులు ప్రజ్వలితమవుతున్నాయి. అవి వారిని ఒక్క క్షణమూ శాంతి పొందనివ్వవు. దైవ శాసనోల్లంఘన వారి గృహాల్ని నరకకూపాలుగా తయారుచేసింది. వార్తాపత్రికలు చూడండి: యూరోపు, అమెరికాల్లో ఆత్మహత్యలు ఎలా ప్రబలిపోయాయో, విడాకులు ఎంతగా అధికమవు తున్నాయో, సంతానం ఎలా తగ్గుతూ తగ్గింపబడుతూ ఉందో, సుఖవ్యాధులు లక్షలాది ప్రజల జీవితాలను ఏ విధంగా నాశనంచేశాయో, వివిధ జాతుల మధ్య కూటి కొరకు ఎలాంటి పెనుగులాట సాగుతుందో, ద్వేషం, కల్మషం, వైషమ్యాలు, ఒకే జాతి వ్యక్తుల్ని అంతర్యుద్ధాలకు ఎలా పురిగొల్పుతున్నాయో, భోగవిలాసాల అభిలాష ప్రజల జీవితాలను ఎలా దుర్భరం జేసిందో! దూరం

నుంచి చూసి స్వర్గానికి ప్రతిరూపాలని మనిషి భ్రమపడే ఈ మహోన్నత నగరాల్లో లక్షలాది ప్రజలు ఎలాంటి బాధాపూరిత జీవితం గడుపుతున్నారో అంతా గమనించండి. ఇదేనా వృద్ధీ – వికాసమంటే? మీరు ఆశగా ఎదురుచూచే ఆ స్వర్గం ఇదేనా?

ప్రియసహోదరులారా! ఒకటి మాత్రం మరువకండి. దైవ వాక్కు ఎన్నటికీ అబద్ధం కాజాలదు. ఈ లోకంలో శాంతీ సుఖాలూ, పరలోకంలో సఫలతా – సౌభాగ్యాలు లభించేందుకు కలిమయే తయ్యిబా తప్ప మానవునికి అనుసరయోగ్యమయిన కలిమా (వచనం) వేరొకటి లేదు. ఇదే పరమ సత్యం. దీనికి భిన్నమయిన విషయం మీరు ఎటు చూచినా కానరాదు.

# కలిమయే తయ్యిబాను విశ్వసించడం

ముస్లిమ్ సహోదరులారా! గత రెండు ప్రసంగాలలో కలిమయే తయ్యిబా భావాన్ని విశదీకరించాను. ఈ వేళ ఈ కలిమాను విశ్వసించడంలో గల లాభాలూ, మరి దాని ఆవశ్యకత, ఏమిటనే ప్రశ్నను చర్చిద్దాం.

మనిషి ఏ కార్యం చేసినా ఏదో ఒక కారణంచేత, ఏదో ఒక లాభానికి చేస్తాడన్న విషయం మీకందరికి తెలిసినదే. అర్థరహితంగా, కారణరహితంగా, లాభరహితంగా ఏ కార్యాన్నీ చేయడు. మీరు నీరెందుకు త్రాగుతారు? మీ దాహం తీరాలని. ఒకవేళ నీరు త్రాగినప్పటికీ, త్రాగకముందున్న పరిస్థితి అలాగే ఉంటే, మీరు నీరు ఏ మాత్రం త్రాగకండి. ఎందుకంటే ఇది నిష్ఫల కార్యం. మీరు భోజనం చేస్తారు. దేనికి? మీ ఆకలి తీరి మీలో జీవన సత్తువ జనించడానికి. కాని భోజనంచేయడం వల్లనూ, భోంచేయకపోవడం వల్లనూ ఫలితం ఒక్కటే కలిగితే దీన్నే ఒక వ్యర్థమైన కార్యమని అంటారు మీరు. జబ్బు పడితే మందు ఎందుకు తీసుకుంటారు? వ్యాధి దూరమవడానికి,

స్వస్థత చేకూరడానికి. మందు తీసుకున్నప్పటికీ, మందు పుచ్చుకునే ముందు ఉన్న స్థితియే ఉంటే ఇలాంటి మందు తీసుకోవడం నిష్ప్రయోజనం అంటారు. వ్యవసాయంలో మీరింత కృషి చేయడానికి కారణం ఏమిటి? భూమిలో నుంచి ధాన్యఫలాలుద్భవించడానికే కదా! విత్తు నాటినప్పటికీ భూమి నుంచి అది మొలకెత్తకపోతే దున్నడం, విత్తనం నాటడం, నీరు పెట్టడంలో ఇంత కృషి చేసేవారు కారు మీరు. కనుక తేలిందేమంటే, ప్రపంచంలో మీరు చేసే ఏ కార్యమయినా దానికి ఏదో ఒక ఆశయమంటూ తప్పక ఉంటుంది. ఆశయం సిద్ధిస్తే కార్యం సక్రమంగా జరిగిందంటారు; సిద్ధించకపోతే కార్యం సక్రమంగా జరుగలేదంటారు.

ఈ విషయాన్ని కాస్త జ్ఞప్తిలో ఉంచుకుని, నా ప్రశ్నలు ఒక్కొక్కదానికే సమాధానాలు ఇవ్వండి. మొట్టమొదటి ప్రశ్న ఏమంటే, "కలిమా ఎందుకు పఠింపబడుతుంది?" తిరస్కారిలోనూ, ముస్లిమ్‌లోనూ భేదం సంభవింప జేయడమే ఈ కలిమా పఠనానికి కారణం" అన్న సమాధానం తప్ప వేరొకటి మీరివ్వ లేరు. "భేదం ఏర్పడటమంటే భావం ఏమిటి? తిరస్కారికి రెండు కళ్ళుండగా, ముస్లిమ్‌కు నాలుగు ఏర్పడుతాయనో లేదా తిరస్కారికి తల ఒకటుంటే, ముస్లిమ్‌కు రెండు కలుగుతాయనో దీని భావమా?" అని నేనడిగితే మీరేమంటారు. "దీని భావం ఇది కాదు, భేదం ఏర్పడటమంటే తిరస్కారి – ముస్లిమ్‌ల అంత్యముల్లో వ్యత్యాసం ఏర్పడటమనీ, తిరస్కారి అంత్యం, ఆఖిరత్(మరణానంతర చిర జీవితం)లో అతను దైవానుగ్రహానికి దూరమై నిష్ఫలతా దౌర్భాగ్యాలు పొందడం అనీ, ముస్లిమ్ అంత్యం, దైవ ప్రసన్నత ప్రాప్తమయి అతను ఆఖిరత్‌లో సౌభాగ్యాన్ని, సఫలతనూ పొందడం అనీ, దీని భావం" అంటారు.

మీరిచ్చిన ఈ సమాధానం నేను చాలా సమంజసమయిందంటాను. కాని ఈ ఆఖిరత్ ఏమిటో కాస్త సెలవీయండి! ఆఖిరత్‌లో నిష్ఫలతా దౌర్భాగ్యాలంటే ఏమిటి? మరి అక్కడ సౌభాగ్యం సఫలత లభించడమంటే ఏమిటి? ఈ విషయాన్ని తేల్చనంతవరకు పై విషయాన్ని చర్చించలేము.

ఈ ప్రశ్నకు సమాధానం మీరివ్వనక్కరలేదు. దీనికి ముందే బదులివ్వబడి ఉంది.

"ప్రపంచం పరలోకానికి సేద్యం లాంటిది."

అంటే ఇహపరాలు రెండు వేరయినవి కావు. ఒకే క్రమంలోనివి. దీని 'ఆది' ప్రపంచమున్నూ, 'అంత్యం' ఆఖిరత్, ఈ రెంటికీ గల సంబంధం, "వ్యవసాయమూ, పంటలకూ" గల సంబంధం లాంటిది. భూమి దున్ని విత్తనం నాటుతారు మీరు, నీరు సరఫరా జేస్తారు. పంట సంరక్షణ జేస్తారు. చివరికి పంటలు ఉపయోగానికి సిద్ధమవుతాయి. సంవత్సరంపాటు మీరు హాయిగా భుజిస్తారు. దేన్ని పండించాలని మీరు పొలాలు సాగుబడి చేస్తారో, అదే పదార్థం పండి సిద్ధమవుతుంది. గోధుమలు నాటితే గోధుమలే పండుతాయి. ముళ్ళు నాటారంటే ముళ్ళే ప్రాప్తమవుతాయి. ఏదీ నాటకపోయారా ఏదీ లభించదు. పొలం దున్నడం, విత్తనాలు నాటడం, నీరు పెట్టడం, పొలాల కావలి కాయడంలో మీ వల్ల జరిగే పొరపాట్లలో పాల, దుష్ప్రభావాల అనుభూతి పంటల కోత సందర్భంలో కలుగుతుంది. ఈ పనులన్నీ సక్రమంగా జరిగివుంటే వీటి ఫలితమూ మీరు పంటల కోత సమయాన్నే చూడగలుగుతారు. ఇహపరాల పరిస్థితి కూడా అచ్చంగా ఇలాగే ఉంటుంది. ఇహలోకం ఒక పొలం లాంటిది. ఇందులో తన కృషి ప్రయత్నాలతో తన కొరకు పంటను సిద్ధం చేసుకునేందుకుగాను పంపబడ్డాడు మానవుడు. పుట్టినప్పటి నుండి గిట్టేంతవరకూ మనిషికి ఇందులో గడువు ఇవ్వబడింది.

ఈ గడువు కాలంలో ఎలాంటి పంట కొరకు మనిషి కృషిజేస్తాడో అదే పంట ఆతనికి మరణానంతర జీవితంలో ప్రాప్తమవుతుంది. ఎలాంటి పంటను అతను కోస్తాడో దాని ఆధారంగానే ఆఖిరత్‌లోని జీవితాన్ని అతను గడుపవలసి ఉంటుంది. ఎవరయినా జీవితాంతం ఈ లోకపు పొలాల్లో మంచి వృక్షాలను నాటి వాటికి బాగా నీరు సరఫరాజేసి, మరి, జాగ్రత్తగా కావలి కాస్తే, అది చిరలోక జీవితంలో అడుగుపెట్టగానే అతని ఈ కృషికి ఫలితంగా ఒక సస్య శ్యామలమైన, రమ్యమైన తోట రూపంలో అతని కొరకు సిద్ధంగా ఉంటుంది. మరి ఈ రెండో జీవితంలో తిరిగి కృషి చేసే అవసరముండదు. ఇహలోకంలో జీవితాంతం కృషిజేసి తాను వేసుకున్న తోట ఫలాల పైనే శాంతిగా, స్వేచ్ఛగా జీవితాన్ని గడుపుకుంటాడు మనిషి. దీనికే జన్నత్ (స్వర్గం) అని పేరు, ఇదే ఆఖిరత్‌లో విజయాన్ని పొందడమంటేను. దీనికి ప్రతిముఖంగా ముళ్ళనూ, చేదూ వెగటు పళ్ళనూ తన ఐహిక జీవితంలో నాటి పోషిస్తూ ఉండిన వ్యక్తికి చిరలోక జీవితంలో వెగటు పళ్ళ పంటే ప్రాప్తమవుతుంది. తన అవివేకానికి పరిహారంగా ఈ దుష్ట పంటను దహనం చేసి, మరొక మంచి పంటను పండించేంతటి అవకాశం మరొకసారి అతనికి అక్కడ లభించదు. అప్పుడు పరలోక జీవితమంతా ఐహిక జీవితంలో తాను కష్టించి పండించిన పంటకు ఆధారంగా గడపవలసి ఉంటుంది. తాను పండించిన ముండ్ల పరుపుపైనే అతను పరుండవలసి ఉంటుంది. తాను నాటిన చేదూ వెగటూ విషపూరితములయిన ఫలాలనే అతను తినవలసి ఉంటుంది. ఆఖిరత్‌లో పరాజయం, పరాభవం పొందడమంటే ఇదే.

ఆఖిరత్ గురించి నేను జెప్పిన ఈ భావమే ఖుర్ఆన్, హదీస్‌ల ద్వారా ఋజువవుతుంది. దీని ద్వారా తేలినదేమంటే ప్రాపంచిక జీవితంలో మానవుని జ్ఞానం, ఆచరణలు సముచితమై ఉండటం వల్ల కలిగే పర్యవసానంగానే

వాస్తవానికి పరలోక జీవితంలో అతను సఫలతనో, నిష్ఫలతనో పొందడం, అతని అంత్యం మంచిగానో, చెడ్డగానో రూపొందడం జరుగుతాయన్న మాట.

ఈ విషయాన్ని మీరు అర్థం చేసుకున్నట్లయితే ముస్లిమ్ తిరస్కారుల అంత్యముల్లో తారతమ్యం అకారణంగా సంభవించిందన్న యదార్థం ఇట్టే గ్రహించుకోగలరు. వాస్తవానికి అంత్యముల భేదం ప్రారంభములోని వ్యత్యాసానికి పర్యవసానమే. ఇహలోకంలో ముస్లిమ్ - తిరస్కారుల జ్ఞానమూ ఆచరణల మధ్య వ్యత్యాసం సంభవించనంతవరకు చిరలోకంలోనూ వీరిరువురి పరిణామాల్లో ఎలాంటి వ్యత్యాసమూ ఏర్పడజాలదు. ఒక వ్యక్తి జ్ఞానం ఆచరణలు, తిరస్కారి జ్ఞానమూ ఆచరణలకు పోలివుంది. అతను పరలోకంలో తిరస్కారికి లభించే పర్యవసానాన్ని ఎదుర్కోకుండా తప్పించుకోవటం ఎలా సాధ్యం కాగలదు?

తిరిగి అదే ప్రశ్న ఎదురవుతుంది. కలిమా పఠించడంలో గల ఉద్దేశ్య మేమిటి? తిరస్కారి పరిణామంలోనూ, ముస్లిమ్ పరిణామంలోనూ వ్యత్యాసం సంభవించడమే కలిమా పఠనంలో గల ఉద్దేశ్యమని మీరింతకు ముందే సమాధానం ఇచ్చి ఉన్నారు. ఇప్పుడు మీరు విన్న పరిణామం ఆఖిరత్ భావనల దృష్ట్యా మీ సమాధానంపై పునరావలోకన జరపవలసివుంటుంది. ఇప్పుడు మీరు ఈ విధంగా చెప్పవలసి ఉంటుంది- ఆఖిరత్‌లో మానవుని అంత్యం చక్కబడడానికి అతని జ్ఞానమూ, ఆచరణలను చక్కబర్చడమే కలిమా పఠించడంలో గల ఉద్దేశ్యం. ఆఖిరత్‌లో పండ్లు కోయవలసిన తోటను ఈ లోకంలో నాటడం మానవునికి నేర్పిస్తుంది ఈ కలిమా. ఒకవేళ మానవుడు ఈ కలిమాను విశ్వసించకపోతే ఆ తోటను నాటే విధానం అతనికి తెలియజాలదు. అలాంటప్పుడు అతను తోటను నాటగలిగేదెలా?

ఆఖిరత్‌లో కోయగలిగేదేమి? మనిషి ఈ కలిమాను నోటితో ఉచ్చరించినా అతని జ్ఞానం కలిమా పఠించనివాని జ్ఞానాన్ని పోలివుంటే, మరి అతని ప్రవర్తన కూడా తిరస్కారి ప్రవర్తనకు సమానమైతే ఇలాంటి కలిమా పఠనం వల్ల ఎలాంటి ప్రయోజనమూ లేదని మీ బుద్ధే పలుకుతుంది. ఇలాంటి వ్యక్తి అంత్యం ఒక తిరస్కారి కంటే భిన్నంగా అవడానికి కారణమేమీ లేదు. తోటను నాటి పెంచే విధానం కూడా అతను తెలుసుకోలేడు. ఇంకా తోటను కూడా నాటలేడు. జీవితాంతమూ ముండ్లే నాటుకుంటూ ఉంటాడు. అప్పటికీ ఆఖిరత్‌లో అతనికి పండ్లతో నిండిన తోట లభించాలంటే ఎలా సాధ్యపడుతుంది? నోటితో కలిమా పఠించినంత మాత్రాన అతను దేవునిపై ఎలాంటి ఉపకారం చేయలేడు. ఇంతకు ముందు అనేక ఉదాహరణల ద్వారా వివరించి నట్లు, ఏ కార్యంలో ఫలితం మాత్రం, దాన్ని చేసినా చేయకపోయినా ఒకటే అవుతుందో అలాంటి కార్యం వ్యర్థమూ అర్థరహితమైంది. మందును సేవించిన తరువాత రోగ స్థితి, మందు పుచ్చుకునే ముందున్నట్లే ఉంటే అది వాస్తవానికి మందు కాదు. సరిగ్గా అదే విధంగా కలిమా పఠించే వ్యక్తి జ్ఞానం ఆచరణలు కలిమా పఠింపనివానికి పోలివుంటే ఇలాంటి కలిమా పఠనం కేవలం అర్థరహితం. ప్రపంచంలోనే తిరస్కారి, ముస్లిమ్‌ల జీవితాల్లో భేదం లేకపోతే ఆఖిరత్‌లోని ఫలితాల్లో తారతమ్యం ఎలా కలుగుతుంది?

ఇప్పుడు ఒక ప్రశ్న. శిష్టవచనం (కలిమయే తయ్యిబా) మానవునికి నేర్పే ఆ జ్ఞానాన్ని పరిగ్రహించిన పిదప ముస్లిమ్ ఆచరణలోనూ తిరస్కారి ఆచరణలో కలిగే తారతమ్యం ఏమిటి? కాస్త గమనించండి. కలిమా ద్వారా మీకు తెలిసే తొలి మాట; మీరు దేవుని దాసులని. ఈ విషయం మీకు తెలిసిన తరువాత మీరు ఎవరికి దాసులో ఆయన ఇచ్ఛానుసారంగానే ఈ ప్రపంచంలో ప్రవర్తించవలసి ఉందన్న విషయమూ దానంతట అదే

వ్యక్తమవుతుంది. ఎందుకంటే ఆయన ఇష్టానికి భిన్నంగా ఆచరించడం యజమానికి తిరుగుబాటుగా పరిగణింపబడుతుంది. దీనికి పిదప కలిమా ద్వారా మీకు తెలిసివచ్చే రెండో విషయం ఏమంటేః హజ్రత్ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) దేవుని ప్రవక్త అని. ఈ విషయం మీకు తెలియగానే, ప్రపంచపు సేద్య భూమిలో ముళ్ళూ విష ఫలాలు కాకుండా, పుష్పాలూ మధుర ఫలాల తోట నాటడం ఎలా సాధ్యమవుతుందో మహాప్రవక్త (సఅసం) బోధించారు. గనుక ఆ విధంగానే తోట నాటడం మీ కర్తవ్యం అన్న విషయమూ అవగతమైపోతుంది. ఆ విధానాన్ని మీరవలంబించారంటే ఆఖిరత్‌లో మంచి పంట లభిస్తుంది. మీరు దీనికి భిన్నంగా ఆచరించారంటే, ప్రపంచంలో ముళ్ళనే నాటగలుగుతారు. ఆఖిరత్‌లో ముళ్ళనే పొందడమూ జరుగుతుంది.

ఈ "జ్ఞానం" ప్రాప్తమైన తరువాత మీ ప్రవర్తన సహితం దీనికి అనుగుణంగానే ఉండటం అనివార్యం. ఒక రోజు మరణించడం తథ్యమనీ, మరణానంతరం మరొక జీవితం ఉందనీ, మరి ఆ జీవితాన్ని ఈ జీవితంలో పండించిన పంటపైనే గడపవలసివుంటుందనీ మీకు అచంచల విశ్వాసమే ఉంటే, మీరు మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) సూచించిన రీతిని వదలిపెట్టి మరో మార్గాన్ని అవలంబించడం సంభవించదు. ప్రపంచంలో సేద్యం మీరు చేసేదెందుకూ? సేద్యం చేయకపోతే ధాన్యం పండదు. ధాన్యం పండకపోతే ఆకలి బాధకు ఆహుతి అవుతామని మీకు గట్టి నమ్మకముంది. మీకీ విషయంలో విశ్వాసమేలేకపోయి వ్యవసాయం చేయకనే ధాన్యం పండుతుందనీ లేక ధాన్యం లేకనే ఆకలి బాధతో విమోచనం పొందగలుగుతామని ధీమా ఉంటే మీరు వ్యవసాయంలో ఏ మాత్రం కృషి చేయరు. ఇదే విధంగా మీ సొంత పరిస్థితినే ఊహించుకోండి. ఒక వ్యక్తి అల్లాహ్

తన ప్రభువుగానూ, మహా ప్రవక్త (సఅసం) దేవుని ప్రవక్తగానూ తనకు విశ్వాసముందని, ఆఖిరత్‌లో కూడా నమ్మకముందని నోటితో అంటున్నప్పటికీ అతని ప్రవర్తన పవిత్ర ఖుర్‌ఆన్ శిక్షణలకు, మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) సున్నత్ (సంప్రదాయం)నకు విరుద్ధంగా ఉంటుంది. ఇలాంటి వ్యక్తి ఈమాన్ (విశ్వాసం) బలహీనమైందని తెలుసుకోండి. తన పొలంలో కృషి చేయని పక్షంలో కలిగే దుష్పలితం గురించి అతనికి ఎంత విశ్వాసముందో అంతటి విశ్వాసమే పరలోక పంటను పండించని పక్షంలో కలిగే దుష్పరిణామంగురించి ఉంటే అతను ఈ కార్యంలో నిర్లక్ష్యం వహించడు. ఏ వ్యక్తి తన కోసం చేతులారా ముళ్ళు నాటుకోడు. తాను నాటేవి ముళ్ళనీ, ఆ ముళ్ళు తనకు కష్టం కలిగిస్తాయనీ నమ్మకంలేని వ్యక్తి మాత్రమే ముళ్ళు నాటుకుంటాడు. అగ్నికణాన్ని చేతులారా ముట్టుకోరు మీరు. అది కాల్చివేస్తుందని మీకు పూర్తిగా నమ్మకముంది. కాని ఒక చరిటివాడు మాత్రం మంటలో చేయివేసేస్తాడు. దాని పర్యవసానం ఏమవుతుందో అతనికేం తెలుసు?

—:సమాప్తం:—